శ్రీసాయినిలయప్రచురణము 23

# శ్రీకృష్ణసాయీగీతామృతము




రచయిత

కీ. శే. శ్రీ బాపట్ల హనుమంతరావుగారు

ప్రచురణకర్త

బాపట్ల వేంకట పార్థసారధి

శ్రీ సాయీ నిలయమ్

చెరువు (P. O.) 522 113

మొదటి కూర్పు 500 ప్రతులు

# కృతి సమర్పణము

శ్రీ సమర్థ సచ్చిదానంద సద్గురు దేవుఁడగు
శ్రీ సాయిబాబా చరణారవిందములకు
అంకితముఁ గావింపఁబడినది.

రచయిత

శాస్త్రగురుబోధలను మఱి స్వానుభవము
కలిమినెద్దాని నరుఁడేడుగడఁగనమ్మ
నదియె శ్రేష్ఠంబుఁ, బరమమౌనదియ, యదె జ
గంబునన్ వాని కవలంబనంబు, సాయి !

మూల్యము 10/-

ముద్రణ :

వి. రామకృష్ణమూర్తి
మేనేజింగ్ డైరక్టర్
వెల్కం ప్రెస్ ప్రైవేట్ లిమిటెడ్,
గుంటూరు - 2

శ్రీసాయినిలయ ప్రచురణము_23

# శ్రీకృష్ణసాయిగీతామృతము



సంశయములఁదీర్చి మదిఁ జంచలతనడఁచి
సకలశుభముల నొడఁగూర్పజాలుదేవ !
క్షణముక్షణమును మాకు రక్షణము నిచ్చి
కృపను బాలింపగదవె ! శ్రీకృష్ణసాయి ! (ప్రచురణకర్త)

రచయిత : కీ. శే. బాపట్ల హనుమంతరావు గారు

ప్రచురణకర్త :

బాపట్ల వేంకటపార్థసారధి

శ్రీసాయినిలయమ్ చెరువు (P.O.) 522113

ఓం శ్రీసాయిసద్గురవేనమః

# ప్రార్థన

కం. సాకారుండవొ; లేక ని
రాకారుండవొ, మతేమియగుదువొ! యెఱుఁగన్
నాకగునె? శ్రితుఁడ, జడుఁడను,
సాఁకవె! నీకరుణఁబఱపి సాయీనాథా!

కం. సందేహములడఁచవె! నీ
యందున నేకాంతభక్తి నందించవె! ని
న్నెందే మఱనీకవె! యఘ
సందోహముఁ బాపఁగదవె! సాయీనాథా!

ఆ. వె. చేయఁదగని పనులు చేసితి నెన్నియో
చేయఁదగినవానిఁ జేయనైతిఁ
కృపణునైన నాకునిఁక వేఱుగతిలేదు
కరుణఁబఱపి ప్రోవఁగదవె! సాయి!

(రచయిత)

# Vidwan E. Muniratnam Naidu

M. A., (Tel)., (Pol. Sci.), ( Socialogy )

Headmaster,

**SWAMY HIGH SCHOOL**

SRIRAMAPURAM Pin : 517 587

## ఆముఖము

ఓం సమర్థ సద్గురు శ్రీ సాయినాథాయనమః

వేద వేదాంత సత్కళా విభవములకు,
ఆర్ష ధర్మ సంస్థాపనాధ్యాయములకు,
సకల తీర్థ సన్మంగళ స్నానములకు,
సాయినాథుండె రక్షయై హాయినిడుత !

ఇది నాకొక పరీక్ష. "షిరిడీ సంస్థాన కవి" యను బిరుదు గన్న స్వర్గీయ శ్రీ బాపట్ల హనుమంతురావు గారి కావ్యమునకు అభిప్రాయము వ్రాయగల సమర్థుడనా ? సద్గురు సాయిగీతాలపై అభిప్రాయము వ్రాయగలనా ? నేనెవడను ? స్థూల, సూక్ష్మ శరీరాలతో అన్నిచోట్ల అన్నికాలాలలో ఆదుకొనుచున్న ఆపద్భాంధవుడు శ్రీ సాయిప్రభువు. ఇది నేను వ్రాయునది కాదు. ప్రభువు బలికింపగా నా కరము కదులుచున్నది.

తండ్రి ఋణము తనయుడు శ్రీ బాపట్ల వేంకట పార్థసారధి గారు కావ్య ప్రచురణద్వారా తీర్చుకొనుచున్నారు. ఇరువురి జీవితములు శ్రీ సాయినాథుని సేవకంకితము గావడము పూర్వజన్మ సుకృతమేగాని, అన్యముగాదని దలంతును.

భగవాన్ శ్రీ షిరిడి సాయిబాబా తనజీవిత కాలములో మహా సమాధిజెందు వరకు చెప్పిన అమృత వాక్కులను భగవద్గీతలోని శ్లోకములకు సమన్వయించి తేల్చిన నవనీతమే యీ శ్రీ సాయికృష్ణ

గీతామృతము. ఇందులో గీతోపదేశమునకు, సాయిసందేశమునకు - ఏ మాత్రము తేడా లేనట్లుగా సోదాహరణ పూర్వకముగా వివరణ జూపబడియున్నది. ఈ గ్రంథమును సాయి బంధువులు తప్పక పారాయణము చేయవలయును.

గ్రంథపఠనము జేయునపుడు శ్రీ సాయిభగవానుడు - శ్రీకృష్ణ భగవానుడు - ఇరు పార్శ్వముల అభయహస్తముల జూపుచున్నట్లు - ఆ మార్గములో మనము పయనించునట్లనుభూతి నొందుదుము. అట్టి ప్రేరణ కల్గించునట్లు గ్రంథకర్త జూపిన రచనా విధానము శ్లాఘ్యనీయము. చదువుచున్నంతసేపు శ్రీ సాయినాథుడు సాక్షాత్తు శ్రీకృష్ణ భగవానుడుగా మనముందు విశ్వరూపముతో సాక్షాత్కరించడము ఇందులోని ప్రత్యేకత. ఆధ్యాత్మిక విషయములను, అక్షరరమ్యతతో ఎక్కడను క్లిష్టత లేకుండా శ్రీ సాయివాక్కు హాయిగా వీనుల విందు గావించు గ్రంథకర్త రచనాశైలి పరిపక్వతతో నున్నది.

"నియతం కురు కర్మత్వం - కర్మజ్యాయోహ్యకర్మణః
శరీర యాత్రాపిచతే న ప్రసిద్ధ్యేదకర్మణః ॥"

ఈ శ్లోకభావమును సాయి వాక్కున కన్వయించడములో అద్వైత భావము స్ఫురింపుచున్నది. నీ నియత కర్మలను సలుపుము. కర్మ లేనిచో దేహయాత్ర సాధ్యముకాదు. శ్రీ సాయినాథుడు "ప్రాప్తించిన దానిని స్వీకరింపు" మన్నారు. నిజమే ఫలితము పైదృష్టిగాక ప్రతిఫలాపేక్షలేని కర్మయేగదా మనుష్యుని ద్వారా మహాత్ములాసించునది. అట్టి అన్వయముతో శ్రీ సాయినాథుని సూక్తిని శ్రీ భగవానుని వాక్కును మనకు ప్రసాదించగా - అది మన వాక్కయినది. అదెల్లరు ఆచరింపదగినదే.

ఆరాధనకు విలువనిచ్చి - ఆచరణ తగ్గుచున్న నేటి కాలములో నిట్టి గ్రంథపఠనము ఎంతయో ప్రయోజనకారి కాగలదు. "నేనుండ

భయమెందులకు ? అనే అభయమును తరచుగా మననము చేయడమే శ్రీ సాయికృష్ణ గీతాల పరమార్థము.

"ఆయా కర్మఫలముల నీశ్వరార్పణము చేయవలయునని "గ్రంథ కర్త సవినయముగా పాఠకులకు మనవి చేసియున్నారు." అన్యథా శరణం నాస్తి త్వమేవశరణం మమ" – అని మనము శ్రీ సాయి నాథుని ఆశ్రయించి సమస్తము ఆయనకు సమర్పించి నిర్భయముగా నుండవలయునని సందేశము నొసంగుచున్నదీ గ్రంథరాజము.

వివిధ విషయములను భగవద్గీతతో సమన్వయపరచి – అనగా లేనిది సమన్వయపరచడము కాదు – ఉన్న దానినే ఉన్నది ఉన్నట్లుగా "ఏకక్రియాద్వ్యర్థకరీ" అన్న సామెతగా, ఏకవచనములో శ్రీ మద్భగ వద్గీతను, శ్రీ సాయీబోధామృతమును మరపురాని విధముగా పాఠ కులకు అందించిన పుణ్యమును గ్రంథకర్త సంపాదించుకొన్నాడు.

ఇది సాయిభక్తులను భగవద్గీతపై భక్తిని కల్గించి; గీతాపారా యణులను సాయిబంధువులుగా, భక్తులుగా చేయుచున్నది. వీరి ప్రయత్నమును సఫలీకృతము జేయ నా సాయి పాదారవిందములకు సాష్టాంగనమస్కృతులీ ఆముఖము ద్వారా అందజేసికొనుచున్నాడను.

సాంఖ్యయోగ విభుత్వాది సర్వధర్మ
సగుణ నిర్గుణ తత్త్వార్థ సారమెల్ల
గీత తప్పకుండగ పరికించి చూడ
అన్నియును గూడ శ్రీ సాయి కన్వయించు.

ఓం శ్రీ సాయినాథార్పణమస్తు

ఇట్లు
శ్రీ సాయిబంధు

శ్రీరామపురం
16-3-85

E. మునిరత్నంనాయుడు.

# విజ్ఞప్తి

సోదరీ సోదర భక్తులారా !

శ్రీ సమర్థసద్గురు సాయీనాథ మహారాజుయొక్క కృపా కటాక్షమున, మీ అందఱ ప్రేమాదరణలతోను, నాపితృదేవులు - కీ॥ శే॥ శ్రీ బాపట్ల హనుమంతరావు గారిచే వారి అవసాన దశయందు రచించిన "శ్రీ కృష్ణసాయీగీతామృతము" అను యీ అధ్యాత్మిక గ్రంథరాజమును శ్రీసాయీ నిలయ ప్రచురములు 23వ సుమముగ వెలువరించు మహద్భాగ్యము నాకు కలిగినది. ఇట్లు ధారావాహికగ గ్రంథములను ప్రతి సంవత్సరం ముద్రించి, భక్తకోటికి అందింపజేయుట శ్రీ సాయీబాబావారి అనుగ్రహము, భక్తుల సత్సంకల్ప విశేషము, నాతండ్రిగారి అదృశ్య అభయ ఆశీర్వాదముల ఫలమనుట నిస్సందేహము. గ్రంథముల ముద్రణకు, బాబా సేవాకార్య క్రమముల నిర్వహణకు, వలయు నిధులతోపాటు- శక్తి సామర్థ్యములు- ఉత్సాహము- సహకారము ఎప్పటికప్పుడు వారినుండి నాకు లభించుచున్నవని స్వానుభవమున చెప్ప గలను. ఇట్లు పెక్కు సేవలందు శ్రీసాయీ ప్రభువు మనలను వినియోగించుకొనుట మన యందఱ సుకృతమే. ఇట్టి భాగ్యమును మనకు బాబా పంచి, మనపై కరుణ కురిపించి, కర్తవ్యమును ముందుంచి, ఆధ్యాత్మిక దశలో మనలను పురోగమింప చేయు చున్నాడని విశదమగుచున్నది.

"శ్రీకృష్ణ గీతామృతము" లో భగవాన్ శ్రీకృష్ణుడు కురుక్షేత్రమున తన అనుంగు భక్తుడు, బాంధవుడునగు అర్జునునకు బోధించిన విశేషములను, శ్రీసమర్థ సద్గురువు సాయీనాథుడు, తాను దేహియై షిరిడీలో నిలచిన కాలములో, తనముందు చేరిన అనుంగు భక్తకోటి సముద్ధరణకై ప్రసంగవశమున, సందర్భానుసారముగ, హృదయమునకు హత్తుకొను సరళమైన, మధురమైన చిన్న చిన్న పలుకులతో బోధ చేసిన శ్రీసాయీబోధామృతము నందలి విశేషములతో పోల్చి యీగ్రంథమును కూర్చి వివరణములు, వ్యాఖ్యలు చేర్చి, యీగ్రంథమును మహత్తరముగ రూపొందించుట జరిగినది.

శ్రీకృష్ణుని ముఖోద్గతమైన గీతలను శ్రీ సాయీప్రభుని ముఖోద్గతమైన ప్రవచనములను పోల్చుటలో నాతండ్రిగారు చేసిన ప్రయోగము ప్రశంసనీయమగును. ఈ గ్రంథము మనకు రెండు విశేషాంశములను బయల్పరచుచున్నది. అవి-శ్రీకృష్ణుడు పలికిన భావము- శ్రీసాయీ సద్గురువు ఉచ్చరించిన బోధయు నొక్కటియే అని- ఇట్లు

యిరువురిబోధల సారమొక్కటియే యని తెలిపి శ్రీకృష్ణభగవానునకు శ్రీసాయిసద్గురువునకు అభేదత్వమును క్రియాత్మకముగ, అర్థవంతముగ, సాదృశ్యముగ చాటుటయునై యున్నవి. ద్వాపరమున తన లీలలు చూపిన శ్రీకృష్ణ పరమాత్మయు- ఈ కలి యుగమున భక్తజనులను, ఆర్తులను పాలించుచున్న సద్గురువు శ్రీసాయినాథుడు నొక్కరేకాని వేరు వేరు కాదు- అష్టభార్యాసమేతుడై, అష్టభోగములనుభవించిన ఆ పీతాంబరుడే, మసీదులో కటికనేలపై పవళించిన యీపేద ఫకీరు. ద్వంద్వాతీతుడు, నగు యీసౌజన్య సాధుమూర్తియే, ఆ16వేల గోపికల ప్రియుడు, మానసచోరుడు. రూప, నామ, క్రియా, గుణ విశేషములు బయటకు భిన్నములుగ పొడసూపినను, వారి అంతర్గత శక్తి. స్వరూప, స్వభావములు ఒక్కటియే. అందులకే భగవద్గీతలలో "నాకును - పరిపూర్ణ జ్ఞానులకును భేదము లేదు" అని పరమాత్మ విశదపరచినాడు అటులనే "పండరీపురమున పాండురంగడను నేనే" అనిబాబా తన భక్తునకు నిరూపించెను. నా తండ్రిగారి స్వానుభవమునకూడ యిట్టి సంఘటనయే జరిగెను. వారుమొదట శ్రీకృష్ణభగవానుని తన యిష్ట దైవముగ నిర్ణయించుకొని, 21 వ యేటనే భగవద్గీతను అనువదించిరి. 1944 సంవత్సరము వరకు శ్రీకృష్ణునే ఆరాధించుచూ గ్రంథరచనలు చేసిరి. 27-12-1944న తెల్లవారుఝామున దివ్యస్వప్నము పొడమి, ఒక కాషాయాంబరధారి కనుపించెను. వారికి పాదాభివందనము చేసిరి. "నీవేమిగ్రంథములు రచించుచుంటివి? "అని ఆస్వామి తండ్రిని ప్రశ్నించిరి. వారు సమాధానమిచ్చిరి. తదుపరి అసాధుసత్పురుషుడు "వాటినట్లుండనిమ్ము. వీనిని...... రచించుము" అని ఒకపుస్తకము నీయబోయెను. కృష్ణునేగొలుచుచున్న నాతండ్రి ఆసాధువుతో "కానీ......" అని సంశయాత్మతో పలుక, నాతండ్రిగారి అంతర్గత అనుమానమును గ్రహించిన ఆసాధుపుంగవుడు తన రూపమును కృష్ణునిగ, రామునిగ, హనుమగ, దత్తాత్రేయ స్వామిగ, శంకరునిగ మార్చి మార్చి చూపి, మరల మొదటి సాధురూపమును చూపెను. వెంటనే నాతండ్రి వారికి సాష్టాంగ నమస్కారముసలుప, ఆ స్వామిఆశీర్వదించి అదృశ్యులైరి. నాతండ్రిగారు వుదయమున లేచి, స్వప్న వృత్తాంతమునకు అచ్చెరువునొంది, కాలకృత్యములు తీర్చుకొని కూర్చున్న సమయమున శ్రీషిర్డీసాయిప్రభుని అనన్య భక్తుడు, శ్రీసాయి వ్యాస బిరుదాంకితులునగు శ్రీ శ్రీ శ్రీ బి. వి. నరసింహ స్వామిగారు దగ్గరనున్న పట్టణమునకు విచ్చేసి, నాతండ్రిగార్ని పిలిపించుకొని, బాబా చిత్తరువును, కొన్ని గ్రంథములను బహూకరించిఅనువదించుమనిఆశీర్వదించుట జరిగెను. రాత్రి స్వప్నమున కాంచిన సాధుమూర్తి, ఆచిత్తరువులోని రూపము నొక్కటిగ గ్రహించి ఆనందాస్రువులు రాల్చి, ఆదినమునుండి శ్రీసాయిభగవానుని

తన ఆరాధ్యదైవముగ యెన్నుకొని ఎన్నియో గ్రంథములు రచించిన విషయము యిదివరలోనే ప్రకటించుటయు జరిగినది. అందువలన శ్రీకృష్ణ సాయీప్రభులలో యెవరిని పూజించినను, ఎవరిబోధల ననుసరించినను ఫలితమొక్కటియేనన సత్యమును నిరూపించుచు దీనికి "శ్రీకృష్ణసాయీ గీతామృతము" అను నామమిడుట జరిగినది.

ఇక ఈ గ్రంథము నందలి అంశములను గురించివిశ్లేషణ చేసినచో గీతలోని 18అధ్యాయములను విడివిడిగా పేర్కొనుచూ, ఆయా అధ్యాయములలో ప్రముఖముగా ఉద్బోధించిన అంశములను ఉల్లేఖించి, తదనుగుణముగా బాబా భక్తులకు చేసిన బోధలను ఏ భాగమునకు ఆ భాగమును సారూప్యపరచి వివరించుట జరిగినది. శ్రీకృష్ణభగవానుడు కృపణుడైన అర్జునునకు గీతల ద్వారా కర్తవ్య బోధను చేసినాడు. కురుక్షేత్రమున తన విధ్యుక్త ధర్మమైన యుద్ధమును మమకారముతో బంధు ప్రీతితో, విస్మరించి, తాను యుద్ధరంగమునుండి వైతొలగుటయే ధర్మమని, అదియే అందరకు శ్రేయస్కరమని, శత్రువధహింసాత్మకము, అధర్మమని పరధర్మమును స్వధర్మముగ, స్వధర్మము పరధర్మముగ భగవానునికి వివరించినపుడు, భగవానుడు చేసిన యీ కర్తవ్యబోధ - షిరిడీవాసుడు తన ఆశ్రితుల స్వార్థబుద్ధిని, ద్వేషభావము లను, అహంకార అజ్ఞానములను తొలగించి, వాని స్థానములో సేవాతత్వము- ప్రేమ తత్వము- విజ్ఞానతత్వము చేర్చుటకు చేసిన బోధలును ఒకే పద్ధతిలో భక్తులకు దర్శన మిచ్చుట యీ గ్రంథమున చూడగలము. కృష్ణభగవానుడు గీతలలో కర్మను విస్మరించరాదని, కర్మత్యాగముకంటె కర్మఫలత్యాగమే శ్రేయమనీ, కర్మషట్కమైన మొదట ఆరు అధ్యాయములలో తెలిపిరి. అట్లే బాబా భక్తులను కర్మసన్న్యాసము చేయుమని ఎక్కడను చెప్పలేదు. సంసారములో వుంటూ సంసారమునకు అంట కుండా ఎట్లు జీవించాలి, కర్మయోగము నేవిధంగా అనుష్ఠించాలి అనువిషయములు ఆచరణ ద్వారా బోధల ద్వారా తెలిపిరి. భక్తిషట్కమైన ఆరు అధ్యాయములలో శ్రీకృష్ణుడు తనయందు నిశ్చల భక్తిని సలుపువారు తనకేంతో యిష్టులని, వారే ఉత్తమ యోగులనీ, తనయందు అనన్యభక్తి కలిగినవారి యోగ క్షేమములు తానే నిర్వహింతునని ప్రతిజ్ఞాపూర్వకముగ పలికిరి. అట్లే సాయి బాబా 'సాయి' అను నామమును ఉచ్చరించుచు, తనబోధలను ఆచరించు సద్భక్తునకు తాను సదా ఋణపడి యుందునని, అతని సర్వభారములు తానే వహింతునని, వాని పాపభారములను, జన్మపరంపరలను తొలగింతునని, కప్పకాలికి దారంకట్టిలాగినట్లు, ఆతని చివరకంటా నడిపించి, గమ్యానికి చేరుస్తానని తనబోధలద్వారా పలికినాడు. చివర ఆరు అధ్యాయ

మూలైన జ్ఞాన షట్కముతో జ్ఞానము-జ్ఞేయము, వర్ణనచేస్తూ ఏది ఆత్మయో ఏది అనాత్మయో, ఏదిజ్ఞానమో-ఏది అజ్ఞానమో, ఏది సత్ పదార్థమో - ఏది అసత్ పదార్థమో, ఏది ఉత్తమగుణమో- ఏది నీచగుణమో, ఏది దైవసంపదయో- ఏది అసుర సంపదయో, ఏది కోరతగినదో - ఏది త్యజింపదగినదో, తదాదిగాగల వివరణము చేస్తూ సత్యమైన మూలపదార్థమును భక్తున కెఱుకపరచినాడు శ్రీకృష్ణపరమాత్మ. అదే రీతిగా పరిపూర్ణ జ్ఞానస్వరూపుడైన శ్రీ షిరిడీభగవానుడు ఆశ్రితులలోని అజ్ఞానాంధకారమును అంతమొందించుటకు, వారిలో ఆత్మజ్ఞానము నెలకొల్పుటకు, అజ్ఞాన మార్గమును - అపమార్గమును వారివారి జీవితపథములలో వేలెత్తిచూపి, వారిని సరి అయిన పథమున నడిపిరి. ముల్లును ముల్లుతోనే తీసిన విధమున వారియందలి అజ్ఞానమును తొలగించుటకు అజ్ఞానమునే ప్రబోధించి, తద్వారా ఆత్మజ్ఞానముపై కప్పబడిన అజ్ఞాన ఆచ్ఛాదనమును తొలగించి, హృదయమున జ్ఞానజ్యోతిని వెలిగించి, ఆత్మానందము నెలకొల్పి, బాబా మూల సచ్చిదానంద జ్యోతి స్థంభముగ నిలిచినారు.

ఆ విధముగ శ్రీకృష్ణుడు కర్మభక్తి జ్ఞానములను క్రమముగ బోధించి, మొదట నిష్కామకర్మను - తద్వారా అనన్యభక్తిని-తద్వారా ఆత్మజ్ఞానమును సాధకుడైనజీవి క్రమముగ సాధించవలెనని చేసిన కర్తవ్యబోధ యీ ప్రపంచమున సత్యమార్గము, ధర్మమార్గమును గానక కుందుచున్న అనేక మందికి కృపణులకు ఎఱుకపరచెను. అటులనే శ్రీ సాయీనాథుడు కర్తవ్యబోధను -తన భక్తులకు ఆశ్రితులకు, ఆర్తులకు, తన ఆశ్చర్యకర చర్యల ద్వారా, చిన్న మాటలద్వారా తెలిపిరి. ఎవరెంతదనుక పయనింప గలరో వారి నంతవరకూ నడిపించుచూ, వారి ఆత్మాభ్యున్నతికి విశేషముగ తోడ్పడిరి,

శ్రీమద్భగవద్గీతయందు 18 అధ్యాయములు యీ గ్రంథమున 17 భాగములుగ పేర్కొనబడెను. అర్జున విషాదయోగము - సాంఖ్యయోగము (1 మరియు 2) ఒకే భాగముగ వివరించుట జరిగినది. ప్రతి భాగమున మొదట గీతబోధ-తదుపరి సాయి గీత పిమ్మట రెంటియొక్క ఏకత్వ నిరూపణ వివరణము క్రమముగ పేర్కొనుట జరిగినది. ఈ గ్రంథమును పఠించుటకు. 843 సూక్తులు గల శ్రీ సాయీనాథ బోధా

మృతము - శ్రీ భగవద్గీత యీ రెండును సోదర భక్తులు దగ్గర వుంచుకొని సమ న్వయము చేసుకొనుట ముఖ్యము.

ఈ గ్రంథమును వెలువరించుటకు తోడ్పడిన సోదర సోదరీ భక్తులకు, పోషకు లకు, ఈ గ్రంథమునకు అవసరమగు బ్లాకులు-టైటిలు పేపరును సమకూర్చిన సోదర సాయిబాబా భక్తులు చిరంజీవులు శ్రీ తుమ్మలపల్లి రామమోహనరావు (విజయవాడ) మరియు శ్రీ N. రాధాపతిరావు (విజయవాడ)లకు, వీరి కుటుంబ సభ్యులకు శ్రీ సాయీ భగవానుడు ఆయురారోగ్య ఐశ్వర్యములు, సుఖశాంతులు ప్రసాదించుగాక అని నా ప్రార్థన. ఈ గ్రంథమునకు ఆముఖము తానే యేరి, కోరి, చి. శ్రీ.విద్వాన్ E.ముని రత్నం నాయుడుగారిచేత పలికించుకొనిన శ్రీ సాయీనాథుడు వీరిని వీరి కుటుంబ మును సర్వధా సర్వదా సంరక్షించుచూ, వీరి సేవలనేకము స్వీకరించుగాక అని నా ప్రార్థన.

## భవిష్యత్కార్యక్రమము

శ్రీ సాయిబాబా క్రొత్త క్రొత్త బాధ్యతలను మన భుజస్కంధములపై ఎప్పటి కప్పుడు పెట్టుచునేయున్నారు. తండ్రిగారు రచించిన "ఏమిరా! నిన్ను పేక్షిం తునా ?" [ శ్రీ సాయిబాబా జీవితచరిత్ర - భక్తుల అనుభవములు ] అను మహ త్తర గ్రంథమును కోరుచూ భక్తులెందరో లేఖలు వ్రాయుచున్నారు. కాని లోగడ ముద్రణ జరిగిన ప్రతులు భక్తులకు పూర్తిగ పంపిణీ జరిగిన విషయము మీకు విది తమే. ఇప్పుడు యీ గ్రంథరాజమును పునర్ముద్రణ కావించవలసిన ఆవశ్యకత యేర్పడినది. ఇది 5 సంపుటములు. 1200 డెమ్మిసైజు పుటలు కలిగి అధిక ధన వ్యయముతో కూడిన బృహత్తర కార్యక్రమమై యున్నది. సుమారు 25.000/-లు వెచ్చించవలసియున్నది. దీని ముద్రణ విషయమై లోగా ప్రకరణములలో భక్తులకు విన్నవించితిని. ఒక్కొక్క సంపుటమునైనా 1985 లో ప్రారంభించి క్రమముగ

ముద్రించవలెనని, 1985లోనే దీనిని ప్రారంభించవలెనని నా ఆకాంక్ష. శ్రీ సాయీ ప్రభువు అనుగ్రహించి మన ఆశయసిద్ధికి చేయూతనీయగలడని పూర్తి విశ్వాసము కలదు. ఈ గ్రంథ ముద్రణమునకు ఒక్కొక్కరు రు 116/-లు యిచ్చి, పోషకులుగ చేరి, అట్లే పరిచితులను, మిత్రులను చేర్పించవలెనని, వీరిని శాశ్వతపోషకులుగ చేర్చి, ఇదివరలో ప్రకటించిన, ఇకముందు ప్రచురించనున్న అన్ని గ్రంథములు నొక్కొక్క ప్రతిని వీరికి పంపబడునని, శ్రీ సాయీప్రభువు మీకెల్లరకు తగిన ప్రోత్సాహము - శక్తి సామర్థ్యములు ప్రసాదించి ఈ కృషిలో భాగస్వాములుగ చేయగలడని నా అభ్యర్థన - దృఢవిశ్వాసము. మరియు శ్రీ సాయీ అనుసరణము - శ్రీ సాయీ విజయము - మా తండ్రిగారి జీవితచరిత్ర తదితర గ్రంథములు అవకాశమును అనుసరించి వెలువరించ ప్రయత్నించగలను.

శ్రీ సాయీ నిలయమున నిత్యపూజలందుకొనుచున్న పాలరాతి విగ్రహ శ్రీ సాయీప్రభువునకు ప్రత్యేకముగ మందిర నిర్మాణము చేయు కోర్కెను ఇదివరలో ప్రకటించితిని. కొందరు భక్తులు కొంత సహాయమునందించిరి. ఇదియు అధిక వ్యయముతో కూడిన కార్యమగుటచేత అట్లే నిలచియున్నది. సర్వభారములు వహించి, తగు సమయమున, తన కార్యమును తానే నిర్వహించుకొని శ్రీ సాయీబాబా ఈ నిర్మాణము జరిపించుకొనునని నా నమ్మకము. పై కార్యభారములన్నియు నిర్వహించుటకు మీరు యింతవరకు చూపుచున్న అవ్యాజానురాగములు యికముందును నాయందు ప్రకటించి, చేయూతనిచ్చి, కృతకృత్యుని చేయకోరుచున్నాను. శ్రీ సాయీ నిలయ ప్రచురణములు ఆంధ్రదేశమున నలుమూలల వ్యాప్తిచేయుటలో, ప్రతి సాయీ భక్తుని యింట ఈ గ్రంథములు విలసిల్లుటలో భాగస్వాములుగ చేసిన మిమ్మెల్లరను శ్రీ సాయీప్రభువు సర్వదా కాపాడవలయునని నా ప్రార్థన.

కృషి కృతార్థమగును సాయి కృపనుబడయ !

ఇట్లు

శ్రీ సాయీభక్తపాదరేణువు,

బాపట్ల వేంకట పార్థసారధి

శ్రీ సాయీనిలయమ్

చెరువు

1-3-1985

— o —

# పోషకులు

రూపాయలు

శ్రీమతి Dr. K. సుభద్రాదేవి M. B. B. S. M. D. మరియు వీరిభర్త
చి. శ్రీ Dr K. రామకుమార్, M. B. B. S. M. D. గుంటూరు 250

శ్రీ R .V. రాజేశ్వరరావు M. A. B. L. Advocate కొవ్వూరు 199

శ్రీ G. రామారావు - ఖరగ్‌పూర్ 136

శ్రీ చింతా శ్రీరాములు పాలకొల్లు 120

కీ. శే. శ్రీ మాచవరం నరసింహారావు Hyderabad 116

శ్రీ D. లోకనాధనాయుడు G. P. O. తాడేపల్లిగూడెం 116

కళాప్రపూర్ణ శ్రీ పసల సూర్యచంద్రరావు తాడేపల్లిగూడెం 116

శ్రీ మంచికంటి వెంకటరామకృష్ణారావు J. E. బొంబాయి 116

శ్రీ R. రామచంద్రరావు, వీరి ధర్మపత్ని పద్మజ,
కుమార్డు చి॥ సాయిప్రవీణ్ మార్కాపురం 116

శ్రీ M. S. అప్పారావు B. E; Assistant Engineer విశాఖపట్నం 100

శ్రీ M. N. Rao Calcutta 100

శ్రీ M. వెంకటరెడ్డి, B. A. B. L. అడ్వొకేటు తణుకు 100

| | | |
|---|---|---|
| శ్రీ సావడి సత్యనారాయణమూర్తి | కురుగోడు. | 75/- |
| శ్రీ N. మహదేవ శాస్త్రి, M, Sc. M, ed. | వరంగల్లు | 75/- |
| శ్రీ C. విస్సావదానులు. | రాజమండ్రి | 70/- |
| శ్రీమతి దేవకమ్మ. | బెంగుళూరు | 68/- |
| శ్రీ D. V, కృష్ణమూర్తి | నంద్యాల | 60/- |
| శ్రీ ఆదిపూడి మోహనరావు | రాజమండ్రి | 58/- |
| శ్రీ V- భరతుడు, Dy. Ex. Engineer. | చీమకుర్తి. | 58/- |
| శ్రీ S. V. రాఘవులు. | హైదరాబాదు. | 60/- |
| శ్రీ G. D· రంజన్. B, Sc. (Hon) | హైదరాబాదు | 50/- |
| శ్రీ Dr. N. V, R. సాంబశివరావు. | విశాఖపట్టణము | 50/- |
| శ్రీ యర్రా రామమోహనరావు | హైదరాబాదు | 50/- |
| శ్రీ Dr. A, V. సుబ్రహ్మణ్యం. L. M. P. | కందుకూరు | 58/- |
| శ్రీ శేషగిరి సత్యనారాయణ | రామచంద్రాపురం | 50/- |

| | | |
|---|---|---|
| శ్రీ G. వెంకటాద్రి. | ముద్రనూరు | 48/- |
| శ్రీ శ్రీనివాసస్వామి పూజారి, | ఉట్నూరు. | 40,- |
| శ్రీ M. చిరంజీవిరావు, | నర్సాపురం. | 40/- |
| శ్రీ E. మునిరత్నం నాయుడు, M. A. M. E, D: | శివరామపురం | 40/- |
| శ్రీమతి K. శ్యామలాంబ. | జబల్‌పూరు | 40- |
| శ్రీ పొన్నాడ జగన్నాదం, వీరిధర్మపత్ని తులశమ్మ | రాగోలు: | 30 |
| శ్రీS. హనుమంతు. | కర్నూలు | 30- |
| శ్రీ J. V. సుబ్బయ్య. Lecturer | ఒంగోలు | 30- |
| శ్రీ వేదాంతం వెంకట నరసింహాచార్యులు, వీరిధర్మపత్ని రామలక్ష్మి. | దూసి | 30- |
| శ్రీమతి A. హైమావతి, | మండపేట | 30- |
| శ్రీ V. వెంకయ్యశర్మ, | మచిలీపట్నం | 30- |
| శ్రీ G. శ్రీరాములు: | ఊళ్ళపాలెం | 28- |
| శ్రీ మతి G. అరవింద. | హైదరాబాదు | 25- |
| శ్రీ తిక్కవరపు శివరామిరెడ్డి, | మాచర్లవారిపాలెం | 25- |
| శ్రీ K, V. సూర్యనారాయణరావు, | ఇల్లెందు | 25- |
| శ్రీ ములుకుట్ల రామమూర్తి. S. T. O. | రై. కోడూరు | 25- |
| శ్రీ శ్రీగిరిరాజు శేషగిరిరావు. | గుండ్లపల్లి. | 25- |
| శ్రీ A, L. నరసింహమూర్తి. Advocate. | కాకినాడ | 25- |
| శ్రీ M. కృష్ణమూర్తి. | ఏలూరు | 25- |
| శ్రీ D. రమాకాంతరావు. | విశాఖపట్టణము | 25- |
| శ్రీ P. రామకృష్ణయ్య | వాల్తేరు | 20- |
| శ్రీ Dr. V. N. శర్మ | మద్రాసు | 20- |
| శ్రీ A. V. S. D. నరసింహారావు. | రాజమండ్రి | 20- |
| శ్రీ జగన్నాధం. | Harihar. | 20- |
| శ్రీ J. V. రమణయ్య | పెద్దాపురం | 20- |
| శ్రీ ద్రోణంరాజు రామచంద్రప్రభు. | ఖగజ్ నగర్ | 20- |
| శ్రీ D. V. సాంబశివశాస్త్రి | హైదరాబాదు | 20- |
| శ్రీ T. కృష్ణమూర్తి. | OWK, | 20- |
| శ్రీ B. శ్రీనివాసరావు | OWK, | 20- |
| (కీ. శే.) శ్రీ జాస్తి సూర్యనారాయణ, | జావిపూడి | 20- |
| శ్రీ. గండ్లూరి గోవిందరావు. | మామిండ్లగూడెం. | 20/- |

| | | |
|---|---|---|
| శ్రీ K. V. కృష్ణారావు | J.L. కొవ్వూరు. | 20- |
| శ్రీ K, V. సుబ్బారావు | తణుకు | 20- |
| శ్రీ తిప్పరాజు కామేశ్వరరావు | గుంటూరు | 16- |
| శ్రీమతి గానుగపాటి ద్వారకాకుమారి | కందుకూరు | 15- |
| శ్రీ J. వెంకటేశ్వరరావు | శ్రీకొవ్విడి | 15- |
| శ్రీ S. V. V. సత్యనారాయణ | కొవ్వూరు | 15- |
| శ్రీ N. వెంకట్రావు | విశాఖపట్టణం | 15- |
| " B. సుబ్రహ్మణేశ్వరరావు. | నర్సాపూర్ | 15- |
| " M. శ్రీరామారావు | కదిరి | 15- |
| చి. కుమారి S. లీలాకుమారి. | మార్కాపురం | 15- |
| శ్రీ భావరాజు భీమశంకరం, | వేగాయమ్మపేట | 12- |
| శ్రీ అద్దంకి శీతారామయ్య పంతులుగారు | ఒంగోలు | 12- |
| " రామినేని రామారావు. | కొండపాటూరు | 12- |

10 రు లు సమర్పించినవారు :

| | | |
|---|---|---|
| " వాకముల్లు రాములు మాష్టరు. | బెలమాం | |
| " చావలి లక్ష్మీనృసింహంగారు, | దూసి | |
| శ్రీమతి D. సూర్యకాంతమ్మ | సాలాపువానిపాలెం | |
| " C. పద్మావతి | గుంటూరు | |
| " నీలంరాజు రాజ్యలక్ష్మి | చెరువు | |
| శ్రీ S. వెంకటస్వామి. | కమలాపురం | |
| " M. కృష్ణానందం. | గుండవోలు | |
| " D. B. V. నారాయణాచార్యులు Dy. E. E. | నర్సీపట్నం | |
| " మాడా నాగలింగం. | రాజమండ్రి | |
| " S. V. V. సత్యనారాయణ | కొవ్వూరు | |
| " P. పుల్లయ్య. M. A, | జరుగుమల్లి | |
| " C. V. హరీష్. | రాజమండ్రి | |
| " V. గోపాలకృష్ణ. | L. వాడపల్లి | |
| " K. పట్టాభిరామారావు. | రాజమండ్రి | |
| " K. దుర్గామల్లేశ్వర్. | చిట్టిగూడూరు | |
| శ్రీ లింగంగుంట్ల మల్లికార్జునిరావు. | గుంటూరు. | |
| శ్రీ V. నారాయణరావు. | హైదరాబాదు. | |
| శ్రీమతి గరిమెళ్ళ వెంకట సుబ్బలక్ష్మి. | వెదురుపాక | 5/- |
| శ్రీమతి చల్లా వెంకట సీతామహాలక్ష్మి | రామచంద్రాపురం | 5/- |

— ० —

శ్రీ విఘ్నేశ్వరాయనమః నమః శ్రీకృష్ణాయభగవతే శ్రీ సాయీసద్గురవేనమః

# శ్రీకృష్ణసాయీగీతామృతము

## 1. శ్రీసాయీగీత - ఉపక్రమణిక

శరీరమను రథమున అర్జునుఁడను జీవి అధిష్ఠించి శ్రీసాయీకృష్ణ భగవానుని తన సారథిఁగాఁ గల్పించుకొని యీ సంసారము-విశ్వ నాటక రంగమునఁ దనపాత్ర నభినయింపఁ దనవిద్యుక్త ధర్మము ననుష్ఠింప బయలుదేరియు భయానకమగు సంసరణ రణరంగమునఁ గాంచిచకితుఁడై

కార్పణ్య దోషోప హత స్వభావః
పృచ్ఛామిత్వాంధర్మ సమ్మూఢచేతాః
యచ్ఛ్రేయ స్స్యాన్నిశ్చితం బ్రూహితన్మే
శిష్యస్తేఽహం - శాధిమాంత్వాం ప్రపన్నమ్ (2-7)

కుటుంబమును పీడించియైనను నేర్చినవాడు-కృపణుడు. వాని భావము కార్పణ్యము. కృపణత్వము. స్వప్రయోజనమే ప్రధాన ముగాఁ గలవాడు. స్వార్థపరుడు_అనిభావము

స్వామీ! ఇందరను వధించి, బాధించి, వీరు వీరి నాశ్రయించిన వారు కష్టముల పాలగుచుండచూచి, జీవించు తలంపుఁగలిగియుంటినే, ఘోర కార్యాచరణకుఁ గడంగితినే! నేనిపుడు చేయతగిన పని యేమి? నావిద్యుక్త ధర్మమేమో తెలిసికొనలేక నిన్ను ప్రశ్నించు చున్నాడను. ఇపుడు నాకు (ప్రియమైనది కాదు) శ్రేయమైన పని యేదో నిశ్చయించి తెలుపుము-నీకు శిష్యుడను (శాసింపఁదగిన వాఁడను) నీకు ప్రపన్నుడను. (నిన్ను శరణుచొచ్చినవాడను). నీకంటె నాకువేఱు శరణ్యములేదు - నీవీమార్గమున ప్రవర్తింపుమని నన్ను శాసింపుము (అర్జునుడను జీవి శ్రీసాయీకృష్ణుని ప్రశ్నించు చున్నాడు).

వివరణము : శ్రేయో మార్గముఁ దెలిసికొని అనుసరించుచు జీవయాత్ర సాంగిప నిశ్చయించుకొను జీవి బ్రహ్మజ్ఞుడగు సద్గురువును సమాశ్రయించి, తన మనోవ్యాకులతను దెలువుకొని, సంపూర్ణ శరణాగతి చేయవలయును. ఈ చర్మ చక్షువులకు గోచరించు వివిధ రూపములుగల జీవులు వేర్వేఱు వ్యక్తులని, తానీ జీవములకు మేలు కీళ్లు గలిగింప సమర్థుడనని, తానే కర్తయని, తలంచి, యిందఱను బాధించి, తాను జీవింపఁ దలచుచున్నాడను అను వ్యసనముచేఁ గర్తవ్యము గోచరింపనివాడు, తన జీవితమునంతదనుక సుఖములని భావించి పర్యవసానమున కష్టములుగా గుర్తించి జీవితముపై విసుగు-నిర్వేదము పొందినవాఁడు - శాస్త్రములు తనకంటె బుద్ధి వరిష్ఠులు తెలిపిన బోధలు స్వకీయానుభవములను పురస్కరించుకొని తన కీవిశ్వ మున అవలంబనము - శరణ్యము అని విశ్వసించి సద్గురుదేవుని శరణుఁ జొచ్చును.

సంపూర్ణ శరణాగతిఁ జేసిన క్షణమునుండి, ఆశ్రితుడగు శిష్యునిఁ గరుణించి, వాని సకల భారములను సద్గురువు వహించి, తన వానిపై ప్రేమకిరణములఁ బఱపి, తనపలుకులచేత, కనులచేత శ్రేయో మార్గము నెఱుకపరచి, చేయూతనొసగి, గమ్యమునకుఁ జేర్చును. జనన మరణాత్మక సంసారచక్రభ్రమణమునుండి విడివడు నివృత్తి మార్గమున పయనము సాగింపఁదలచు జీవి, 1. గాఢ విశ్వాసము (నిష్ఠ) 2. ధైర్యముతోఁగూడిన ఓర్పు (సబూరి) అను రెండు కానుకలు తొలుత గురుదక్షిణగ సమర్పించి సద్గురుదేవునకు సంపూర్ణ శరణాగతిఁ జేయవలయును. అపుడు సద్గురువు ఆశ్రితుని దనవానిగ స్వీకరించి తీర్చిదిద్దును. తనయంత వానిగ గావించును. (అపనా సరీకా కరితత్) ఇదియే భ్రమరకీటక న్యాయము ]

# శ్రీ మద్భగవద్గీత - సాంఖ్యయోగము

నత్వేవాహం జాతునాసం - నత్వం నేమేజనాధిపాః
నచైవనభవిష్యామ స్సర్వేవయ మతః పరమ్ (2.12)

నేనొకప్పుడును లేనివాఁడనుగాను-నీవు లేనివాడవుకావు_ఈరాజు లంతయును లేనివారలుకారు. ఇఁకమీఁద నేని యీ యందఱము లేక పోము. అనగా యెప్పుడు నున్నవారమే.

నాఽసతో విద్యతేభాఽవో నాఽభావో విద్యతే సతః
ఉభయోరపిదృష్టోఽన్త స్త్వనయోస్తత్త్వ దర్శిభిః (2.16)

అస్థిరములైన దేహాదులకు(స్థిరత) ఎల్లకాలము వుండుటలేదు.స్థిరమైన ఆత్మకు (అస్థిరత) ఏకాలముననైన లేకపోవుటలేదు. ఈ రెంటి యొక్క (దేహము - ఆత్మ) భేదము తత్త్వదర్శనులగువారలు ఎరుగుదురు.

శ్రీ సా యి గీ త : (అద్వైత స్థితిలో) నేను నిరాకారుడను. సంపూర్ణుఁడను. నిర్గుణుఁడను నాకొకపేరులేదు. నివాసములేదు. (ద్వైత భావమున) కర్మముచే బద్ధుఁడనై ఒకదేహమున జేరితిని (కావున) ఒకపేరు - నివాసము పొందితిని నాపేరు "దేహి". ఈ ప్రపంచము నానివాసము. 'బ్రహ్మము' - నా తండ్రి. 'మాయ'. నాతల్లి. వారి కలయిక వలన ఈ దేహము పొందితిని.ఈ విశ్వమున తోఁచు సకలము అశాశ్వతము. పరిణామము (మార్పు) పొందునది. (సా. బో. 61)

నేను పర్వర్దగర్ (దైవము) అగుదును. నేను శిరిడియందును ఎల్లయెడల నుందును. నావయస్సు లక్షల సంవత్సరములు - నావని ఆశీస్సుల (దీవనల) పలువుట. సమస్తవస్తువులు నాకుచెందినవే. ప్రతి వస్తువు ప్రతి జీవికి నేనేయిత్తును. (సా. బో. 61_62)

గమనిక :- సా. బో. = "శ్రీ సాయినాథబోధామృతము" లోని సూక్తులు,

ఈ దృశ్య ప్రపంచము నిలుకడ లేనిది. అస్థిరము. పరిణామము (మార్పు) నొందుచుండునది; మూఁడున్నర మూరలు ప్రమాణము గలిగి 'కుపిసీ'చే కప్పఁబడిన యీ తనువును "సాయీబాబా" అని తలంచుట అవివేకము. అని బాబా తనభక్తులకు బోధించినాఁడు. మరియు మృతినొందినవారికై శోకించు తన భక్తులకు బాబా యిటుల బోధించినాడు "మృతి నొందిన ఆ బాలుని ఆత్మను ప్రవేశించిన నూతన తనువును పరిమార్చి, యందుండి కొనివచ్చి, యీ మృత దేహమునఁ జేర్చి పునర్జీవితునిఁ జేయఁగలను కాని, ఆ నూతన తనువునఁ జేయగల మంచిపనులను చెఱచినవాఁడనగుదును (సా. బో-93)

**వివరణము:** ఉపాసనీ బాబాకుతప్పతక్కిన ఆశ్రితులకెట్టి కఠిన నిష్ఠలు శ్రీసాయీప్రభువు విధింపక పోయినను అసత్యము - అస్థిరమునైన వానిని సత్యము - స్థిరములగునని విశ్వసింపవలదని, ప్రధాన వస్తువును విడిచి నీడకై ప్రాకులాడవలదని, భౌతిక వస్తువుల కొఱకై వ్యామోహము పొందుట అవివేకమనియుఁ దనబిడ్డలకు బోధించినాఁడు. బాబా తన దైవీసంపత్స్వభావము - ఋతంభర ప్రజ్ఞ తన వారికెఱుకపఱచి, యీ సత్యప్రబోధమును పలుమాఱులు వారివారి స్వానుభవముల పాదుకొనఁజేసిన విషయములు మున్ముందుఁ దెలిసికొనఁగలరు.

## 2. శ్రీ మద్భగవద్గీత-కర్మయోగము

నియతం కురుకర్మత్వం - కర్మజ్యాయోహ్యకర్మణః
శరీరయాత్రాపిచతేన ప్రసిద్ధ్యేద కర్మణః (3-8)

నీనియత కర్మములను నలువుము. (విద్యుక్త) కర్మములనుచేయకుండుట కంటె కర్మము లాచరించుటయే శ్రేయము-కర్మముల నాచరింపని యెడల దేహయాత్ర (పోషణము) నీకు సాధ్యముకాదు.

**శ్రీసాయీగీత : (సంతృప్తి - శరణాగతి)**

దైవము గొప్పవాఁడు. అతడు మహాప్రభువు-"అల్లామాలిక్" దైవమెంత గొప్పవాడు! అతనితో నెవరు సమానులుకారు. అద్వితీయుడు. అతఁడే సకలమును సృష్టించి, పోషించి, లయింపఁ జేయువాఁడు. ఆతండ్రి లీలలనూహ్యములు. మనతలంపులను ఆయనకధీనములఁ గావించి ఆయన మనలనిలుపఁ దలచిన విధమున నిలుచుటకు సంతృప్తి నొందుదము. "అల్లా రఖేగా వైసా రహేనా"-ప్రాప్తించిన దానిని స్వీకరింపుము. సంతృప్తి సంతోషములఁ బొందుము. ఎన్నడును ఆందోళన పొందకుము. ఆతండ్రి సమ్మతి, సంకల్పము లేక ఒక ఆకే నియుఁగదలదు"

ఋజుభావము-నిర్భయము-సాధుత్వము కలిగియుండవలయును. మనలో నెవరికివారు వారి ధర్మములను-విధులను నిర్వర్తించుచుండవలయును. కాని మనపనులకు మనమే కారణములము - కర్తలము - అని తలంచి ఏక్షణమునందైన మోహభ్రాంతులను పొందరాదు. కర్త దైవమే! ఆయన స్వాతంత్ర్యము - మన పారతంత్ర్యములను గుర్తించి, సకల కార్యములు ఆ స్వామివిగనే తెలిసికొనవలయును అటుల గావించిన మనము అలిప్తులమై కర్మబంధముల నుండి విడివడుదుము (సా. బో. 267)

"యోగ- యాగ-తపో - జ్ఞానముల నుపార్జింపఁజాలని జీవితము వ్యర్థము" (సా. బో. 290) నీవు భోజనము చేయుచూ నూరక కూరుచుండువా (సబూరి) ఓర్పును, ధైర్యమును పాదుకొలుపుకొనుము; (సా. బో. 291)

**వివరణము:** శ్రీసాయీబాబా యందుగల ప్రత్యేకత గమనింపఁదగును దైవమును జేరుటకు సులభమార్గము బాబా తన ఆశ్రితులకుఁ దెలిపిన ను ప్రపంచ కార్యకలాపములకు విముఖులరగుఁడనికాని, కుటుంబ

సాంఘిక ధర్మములను తారుమారు చేయుండని కాని, తనవారికి బోధించలేదు. బ్రహ్మచారికాని, గృహస్థుడుకాని తనవిధులను తాను నిర్వర్తింపవలయునని, అటుల గావించుచున్నను తాను గావించు సకల కర్మములు భగవత్కర్మములని మాత్రము మఱువరాదనియు, అట్టి సకల కర్మఫలములను సర్వేశ్వర పదసమర్పణముం గావించి తీరవలయునని బాబా బోధించినాడు. ఆబోధలను కేవల ముపదేశములు మాత్రమే కానీయక తన బిడ్డలు స్వకీయానుభవములందు గుర్తింపం గలుగు పటులం గావించినాండు. దయామయుండగు భగవానుండు ప్రతి వ్యక్తికిం బ్రసాదించిన దేహ బుద్ధి బలముల నితరుల మేలుకొఱకు ఉపయోగింపక కేవల స్వార్థప్రయోజనములకు వినియోగించుకొనుట "కార్పణ్యదోషము" అని మన శాస్త్రములు విశదపఱచుచున్నవి.

కావున ప్రతివ్యక్తియు తనశక్తి నితరుల మేలుకొఱకు వినియోగించి ప్రవర్తించుటచేతనే తనను తానుద్ధరించుకొనుచున్నాండని గ్రహింపందగును. ఈ సత్యమును బాబా తాను ఆచరించి తనజీవితము తన దైనందిన ప్రవర్తనలద్వారా తన ఆశ్రితులకు బోధపఱచినాండు. ఎడతెఱపిలేక బాబా కావించు నిస్స్వార్థసేవాకార్యములే విశ్వకల్యాణప్రదములై జనానీకమునకు ఐహికక్షేమము నైతికాధ్యాత్మికాభ్యున్నతులను గలిగించినవై యున్నవి. ఇదియే భగవద్గీతయందు ప్రతిపాదింపబడిన కర్మయోగము నందలి సారాంశమని మనము గ్రహింపవలయును.

## 3. శ్రీ మద్భగవద్గీత-జ్ఞానయోగము

బహూనిమేవ్యతీతాని జన్మాని తవచార్జున
తాన్యహంవేద సర్వాణి నత్వంవేత్థపరంతప. (4-5)

అర్జునా! ఇంతకుపూర్వము నాకనేక జన్మములు గడచినవి. నీకును అనేక జన్మలు గడచినవి. వానినన్నిటిని నేనెఱుంగుదును. నీవు వాని నెఱుంగజాలవు.

యదాయదాహిధర్మస్య గ్లానిర్భవతిభారత
అభ్యుత్థాన మధర్మస్య తదాఽఽత్మానం సృజామ్యహమ్. (4-7)

అర్జునా! ఎప్పుడెప్పుడు ధర్మమునకు హానికలుగునో ఎప్పుడెప్పుడ ధర్మమునకు పెంపుగలుగునో ఆయా సమయములందు నన్ను నేను సృజించుకొనుచుందును.

పరిత్రాణాయ సాధూనాం-వినాశాయ చ దుష్కృతాం
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే. (4-8)

సాధుసంరక్షణము-దుష్టశిక్షణము కొఱకు ధర్మమును చక్కగ నిలుపుట కొఱకు యుగయుగమున (అవసరమైనప్పుడెల్ల) అవతరించుచుందును.

**శ్రీసాయిగీత :** సా. బా :- ఆహా! ఇప్పటి కెన్ని జన్మములనుండి మీ వెంటనుంటిని? మనము మరల మరల కలియుచుందుము. కేయిం బవల్లు నాబిడ్డలను గూర్చి జాగ్రత్త పడవలయును (సా. బో. 97)

నాపని ఆశీస్సులు పలుకుట (సా. బో. 62)

నీటిని నాచు కప్పిపుచ్చునటుల జ్ఞానము అజ్ఞానముచే నావరింపబడినది. నాచును తొలగజేయుము. స్వచ్ఛమైన జలముతోచును. నీటిని సృష్టించవలసిన పనిలేదు. నీరు అందేకలదు. ఇట్టిదని నిరూపింపవలవికాని మాయచే కల్పితమైనదీ ప్రపంచము. అజ్ఞానమే మాయ అయినను అజ్ఞానమే అజ్ఞానమును భాసిల్లజేయును. జ్ఞానము ఎఱుగబడవలసినదే కాని ప్రత్యక్షముగ ఉపదేశించుటకు సాధ్యముకాదు. (సా. బో. 183)

**వివరణము :** విజ్ఞుడగువాడు తన యీ జీవితము పూర్ణమని, తుది జన్మమని సంతృప్తి నొందజాలడు. అనంత కాలగర్భమున మాటుపడి, విస్పష్టముగాక తనకగమ్యమగు గతమును గూర్చియు, భవిష్యత్తును గూర్చియు నెంతయొ యోజించుచుండును. ఇట్టి భూత

భవిష్యత్తులను దృష్టి యందుచుకొని వర్తమాన జీవితమునుగూర్చి తలంచుచుండును. ఇట్టి అనంతమును అవ్యక్తమునైన కాలము అను మహాసముద్రమున వర్తమాన జీవిత పరిమితి నొకబిందువు మాత్రమునగ భావించును. జ్ఞానియగు వానికి నిట్టి జీవిత దృక్పథము సుఖదుఃఖాదులందు సమచిత్తము పాదుకొలుపుటకు సమర్థమైనది యగును.

ఈ విచిత్ర విశ్వప్రవర్తన మొకనిర్ణీతమైన సిద్ధాంతముపై నాధారపడియున్నది. అట్టి ఈశ్వరనిర్ణీత సిద్ధాంతములకు విరుద్ధములుగ నేయే శక్తు లెందెందుఁ బొడచూపినను ఆయా దేశకాలాదుల కనుగుణముగ సర్వేశ్వరుఁడవతరించి, అట్టి విపరీత దుష్టశక్తులను రూపుమాపి, శాశ్వత ధర్మమును సంస్థాపించి విశ్వప్రవర్తనమును నిరాటంకముగ వర్ధిల్లఁజేయును. ఈ విషయమును గమనించి, తదను గుణ్యముగ జీవితము గడపు సజ్జనులకు జగన్నాథుఁడు రక్షకుఁడై సంసార సాగరమునఁ గూలనీయక కాపాడుచుండును. శ్రీ సాయిప్రభువు మూర్తీభవించిన సర్వేశ్వరుఁడని భక్తులు విశ్వసింతురు.

జ్ఞానము సుస్థిరము. అజ్ఞానము క్షణికమాత్రము. నిలుకడలేనిది. జ్ఞానసిద్ధి (ఎఱుక) గలుగుటయే భగవానునిఁ జేరుట-యని మనము గ్రహింపఁదగును.

## 4. శ్రీ మద్భగవద్గీత-కర్మసన్న్యాసయోగము

బ్రహ్మణ్యాధాయకర్మాణి సంగంత్యక్త్వాకరోతియః
లిప్యతేనసపాపేన పద్మ పత్రమివాంభసా (5-10)

సకల కర్మములను పరమాత్మ యందుంచి (పరమేశ్వ రార్పణ బుద్ధి కలిగి) ఆయా కర్మఫలము నందాసక్తి వదలి సమాచరించు వానిని తామరపాకును అంటని నీరమటుల ఆయా కర్మ సంబంధములగు పాపములంటవు.

విద్యా వినయసంపన్నే బ్రాహ్మణే గవిహస్తిని
శునిచైవశ్వపాకేచ పండితా స్సమదర్శినః (5-18)

వినయ విద్యలు గలిగిన విప్రునందు, గోవునందు, ఏనుగునందు కుక్కయందు, అట్టి కుక్క మాంసమును భక్షించు చండాలునందు విజ్ఞులగు సాధువులు సమదృష్టి కలిగియుందురు.

**శ్రీసాయిగీత :** సా. బా:- భగవానుని అనుమతిలేనిదే నేనేమియు చేయఁజాలను. (సా. బో. 101)

సా. బా:- మన తలంపుల నాయన కధీనములుగావించి, ఆయన మనల నిలుపఁదలచిన విధమున నిలుచుటకు సంతృప్తి నొందుదును. "అల్లా రఖేగా వైసా రహేనా" (సా. బో. 267)

సా.బా:- సోమరితనము వహింపకుము. ఏదోక కృషిచేయుము. దైవ నామమును స్మరింపుము. సద్గ్రంథములను పఠింపుము. (సా. బో. 269)

**సర్వవ్యాపకత్వము :** నేను నిరాకారుడను. ఎల్లడలనున్న వాడను. ప్రతివస్తువు నందున్నవాడను. ప్రతి పదార్థమున దానికావలనున్న వాడను. నేనాకాశమునంతట నిండియున్నవాడను. నీ దృష్టికి గోచరించునది సకలము నేనే. నేను చలింపను. కదలను. (సా. బో. 66)
ఈ దృశ్యము సకలము నా ఆకారమే-చీమ-ఈగ-రాజు-పేద
(సా. బో. 67)

ఆకలి నొందు కుక్కకు అన్నము పెట్టుట నన్ను భుజింపఁబెట్టుటయే. దాని ఆకలి తీరిన నా ఆకలి శమించును. (సా.బో. 69)

ఒక్కొక వేళ కుక్కగ - నొక్కొకతఱి పందిగ - నేనువత్తును. ఏభక్తుడు ప్రతిజీవియందు నన్ను గుర్తించి, తగిన రీతిని ఆదరించునో ఆతఁడనుగ్రహింపఁబడును. (సా. బో. 71)

ఎల్లప్రాణులను ప్రేమించుము (సా. బో. 268)

**వివరణము :** శ్రీ సాయీనాథుఁడు మనకు ప్రత్యక్షానుభవమున విశదపఱచిన అంశములఁగనుడు.వివిధయోగముల (కర్మ-భక్తి-జ్ఞానము) సామరస్య సమన్వయములను చక్కఁగ విశద పఱచుటచేతనే శ్రీ మద్భగవద్గీతల ప్రసిద్ధి-విశిష్టత-ప్రకటమగుచున్నది. జ్ఞాన (సాంఖ్య) కర్మయోగముల రెంటినొక్కటిగ నెఱుఁగఁ జాలినవాఁడే సత్య దృష్టి గలవాఁడని శ్రీకృష్ణ భగవానుఁడు తెలిపినాఁడు. బాహ్య ప్రపంచము నకు విధి విరామములులేక కర్మముల నాచరించుచున్నటుల (మానవుఁడు) కనఁబడుచున్నను ఆంతరంగికముగ త్యాగబుద్ధి - సకల కర్మ ఫలముల సర్వేశ్వరాంకితము చేయు ఎఱుకను-లెస్సగ హృదయమున పాదుకొనఁ జేయుచుండవలయును. అట్టి త్యాగరూపమైన పరమేశ్వ రాంకితమైన జీవితము పుణ్యపాప విదూరమై సకల కర్మబంధ విముక్త మగును. కర్మములను విడుచుట (కర్మసన్న్యాసము) కంటె (పరమేశ్వ రాంకితమైన) త్యాగరూపమైన కర్మయోగమే (లెస్సగ కర్మముల నాచరించుటయే) శ్రేష్ఠమని శ్రీకృష్ణ భగవానుఁడు అర్జునునకు బోధించినాఁడు.

శ్రీ సాయీనాథుఁడు తన భక్తులనందఱను నిస్స్వార్థ సేవా కార్యముల నాచరింపుచు ఆయా కర్మ ఫలములను తన పదములకు సమర్పింపుమనియే బోధించినాఁడు. ఇదియే కర్మభక్తి జ్ఞానములనఁ బఁడు మూఁడు యోగముల యొక్క సమన్వయము. అజ్ఞాన-అహంకార జనితమైన భ్రాంతి నశించనంతవరకు సమత్వ దృష్టి వహిం చుట దుస్సాధ్యమేకాదు_దుర్లభమునగును. చీమల ఈఁగల ప్రభు వుల పేదలయందుఁ దానే యధివసించియున్న కారణమున సమదృష్టి వహింపుఁడని బాబా తన భక్తులకు బోధించినాఁడు.

**హన్సిరాజు :** అనువాఁడు పిల్లిని కొట్టిన ఆ ప్రేటు తనకు తగిలినట్లు బాబా చూపినాఁడు. (సా. బో. 73ఎ)

**ఉపాసనీ మహారాజునకు** , నల్లకుక్క, రోగియగు శూద్రరూపముల నున్నది తానే యని బోధపఱచి సమదృష్టి వహించునటుల అనుభవ పూర్వకముగ బాబా ఎఱుక పఱచినాఁడు. (సా. బో. 73బి)

**నానాసాహేబు చందోర్కరు** తెచ్చిన పూరణ్ పోళీలను చీమలు ఈగలు రూపమున తానారగించినట్లు బాబా ఎఱుక పర్చినాఁడు.

(సా. బో. 199)

తాను శ్రీకృష్ణుడుగ అర్జునునకు వ్యాగ్రూపమున బోధించిన విషయములను శ్రీ సాయీకృష్ణుఁడు తన భక్తులు దృష్టాంతముగ-అనుభవ పూర్వకముగ తెన్నగ గ్రహింపఁగలుగునటుల సంఘటనలఁ గూర్చి ప్రబోధఁ గల్పించినాఁడని మనము గ్రహించవలయును.

## 5. శ్రీ మద్భగవద్గీత-ఆత్మసంయమయోగము

సుహృన్మిత్రార్యుదాసీన మధ్యస్థద్వేష్యబంధుషు
సాధుష్వపిచపాపేషు సమబుద్ధిర్విశిష్యతే. (6-9)

మంచి హృదయముగల హితులయెడ, మిత్రులయెడ, ఉపేక్షితులయెడ, సములయెడ, ద్వేషించు శత్రువులయెడ, బంధువులయెడ, సత్ప్రవర్తనఁ గలవారియెడ దుష్ప్రవర్తనగలవారియెడ, సమభావము గలిగియుండువాఁడే అధికుఁడు(ఉత్తముఁడు)

నాత్యశ్నతస్తు యోగోఽస్తి న చైకాంతమనశ్నతః
నచాతి స్వప్నశీలస్య జాగ్రతో నైవచార్జున (6-16)

అధికముగ భుజించువానికి, భోజనమే చేయనివానికి, అధికముగ నిద్రించువానికి, నిద్రయే లేనివానికిని అర్జునా! యిట్టి (నేను తెలిపిన) యోగము దుర్లభము.

**శ్రీసాయిగీత :** సకల జీవములను ప్రేమించుట సా.బా:- ఎల్ల ప్రాణులను ప్రేమించుము-ఎవరితోడను కలహింపకుము. ప్రతీకార బుద్ధి

వహింపకుము. ఎవరిని నిందింపకుము. ఎవరేని నీకు వ్యతిరేకముగ మాటాడిన కలతపడక తొలఁగిపొమ్ము. ఇతరుల మాటలు నీతనువును దుస్సికొనవు. ఇతరుల పనులు వారినే బాధించును. నిన్ను బాధింపవు నీవు కావించునవియే నిన్ను బాధించును. (సా. బో. 268)

**ఇతరనైతిక బోధలు :** సా. బా:- (చంద్రాబాయి బోర్కరుతో) మన మితరులయెడ ద్వేషము- ఈర్ష్య- ప్రతీకారవాంఛ వహింపఁదగదు. ఇతరులు మనల ద్వేషించిన, నామజపమునకుఁ గడఁగి వారికి దూరముగఁదొలగుటమేలు (సా. బో. 270)

సా. బా:- (అబ్దుల్‌తో) చాల తక్కువగ భుజింపుము. వివిధ శాక పాకములు తగవు. ఏదొక అనుపాకముచాలును. ఎక్కువగ నిద్రింపకుము. నీవు చదివిన అంశములఁగూర్చి ధ్యానింపుము-అల్లాను స్మరింపుము. (సా. బో. 294)

సా. బా:- ఎవఁడేని ఇతరుని కోపించెనేని నేను వెంటనే బాధ పడుదును. ఇతరుని ఎవఁడేని నిందించిన నేను నొచ్చుకొందును. ఇతరులు నిందించిన ధైర్యముతో సహించువానినిఁ గూర్చి మిక్కిలి సంతోషింతును (సా. బో. 208)

**వివరణము :-** బాబా తనబిడ్డలకు ఎల్లవిషయముల ఎల్లవేళల మితత్వము పాటింపుమని బోధించినాఁడు. ఆధ్యాత్మిక సుఖమునకిది మిక్కిలి అవసరమని తెలిపినాఁడు.ఎవరేని మనల నిందించిన ఆనిందించిన వానికే హానికలుగును. మనము అట్టివానియెడ ప్రతీకారబుద్ధి వహింపఁ దగదు. వాని పలుకులు మన అభ్యున్నతికి హానిఁగూర్పవు. మనల చెఱచిన, బాగుపఱచిన మనము కావించు పనులే ప్రధానములు. సహింపరాని పరిస్థితులు మనల నలమికొనిన భగవన్నామస్మరణము కావింపఁదగును. దానిచే మనదైవీసంపత్ప్రపూరిత తరంగములు మన

వాతావరణమును గప్పిపుచ్చి ప్రతికూల వాతావరణమును త్రోసి రాజనఁగలవు.

యోగసాధనమందు దృష్టినిలుపుదుమేని, దేహపోషణమునకవసరమగు మాత్రము భుజింపఁదగును. మిక్కుటముగ దిగమ్రింగుట మానవలయును. అధికముగ నిద్రించుట తగదు. దేహపోషణమునకు మితత్వమెంతయు నవసరము. మనము చదువువానిని, వినువానిని, నేర్చుకొనువానినిఁగూర్చి మననము చేయఁదగును. దైవచింతనతో కాలముఁ బుచ్చఁదగును. బాబాబోధలలోని సారము ఇదియని మనముగుర్తించవలయును.

## 6 శ్రీమద్భగవద్గీత - విజ్ఞానయోగము

మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతిసిద్ధయే
యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తితత్త్వతః (7-3)

వేలకొలది మానవులలో నే యొకఁడో జ్ఞానసిద్ధికై యత్నము చేయును. అటులజ్ఞానసిద్ధికై ప్రయత్నించువారిలో నే యొకఁడో నన్ను యదార్థముగ గుర్తింపఁగలఁడు

చతుర్విధా భజంతే మాం జనాస్సుకృతినోఽర్జున
ఆర్తోజిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీచ భరతర్షభ
తేషాంజ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తిర్విశిష్యతే
ప్రియోహిజ్ఞా నినోఽత్యర్థ మహంసచమమప్రియః (7-16-17)

అర్జునా! ఆర్తుడు (కష్టములనున్నవాఁడు) జిజ్ఞాసువు (తెలిసికొనవలయునను కోరికగలవాఁడు) అర్థార్థి (ధనము కోరువాడు) జ్ఞాని (ఎఱుకగలవాఁడు) అను నాలుగు తెఱఁగుల జనులునన్ను సేవింతురు. వీరందఱిలో ఏకాంతభక్తిగలిగి, నిత్యయుక్తాత్ముఁడైన (నిరంతరము నాయందు నిలుపబడిన మనస్సు గలవాఁడైన) జ్ఞాని శ్రేష్ఠుఁడు. అట్టిజ్ఞానికి నేను ప్రియతముఁడను. వాఁడు నాకు ప్రియతముఁడైనవాఁడు

**శ్రీసాయిగీత :-** సా. బా:- (రహానేతో) ఆపూచిన మామిడిచెట్టును చూడుము! ఆపూత అంతయు కాయలుకాసి పండిన అది యెంత చక్కని పంటయగును? కాని, కాయునా? పూతగనో, పిందెలుగనో గాలికి చాలభాగము రాలిపోవును ఏకొలఁదియో శేషించును.

(సా. బో. 134)

సా. బా :- (తార్ఖడ్ సతితో) అమ్మా! ఈరోజులలో నేను మిక్కిలి బాధింపఁబడుచున్నాఁడను. కొందఱు ధనమును, కొందఱు భార్యలను, మఱికొందఱు బిడ్డలను మొదలగు వానిని కోరుదురు. ఆహా! నాదగ్గఱఁగల దానిని కోరువారెవ్వరును లేరు. నేనిటులవేచి వేచియున్నాడను. (సా. బో_97)

**వివరణము :-** శ్రీ శంకర భగవత్పాదులు "వివేకచూడామణి" యందు "జంతూనాం నరజన్మదుర్లభమ్" "సకల జీవములలో నర జన్మము దుర్లభమని- అటుల మనుష్యులుగ జన్మించిన వారిలోఆత్మాఽనాత్మ వివేకము సంపాదించి, ఆధ్యాత్మికాభ్యున్నతికై ప్రయత్నించు వారు మిక్కిలియరుదు." అని తెలిపినారు.మనుష్యకోటియందే కొలది జనులుమాత్రమే అట్టి ప్రయత్నమున స్థిరబుద్ధి గలిగి యుందురు. అటుల ప్రయత్నించువారిలో పరమార్థసిద్ధిఁ బడయువాఁడే యెవనో యొకఁడుండును. అట్టివానికి భగవంతుఁడత్యంత ప్రియుఁడు. భగవానునకునట్టివాడు మిక్కిలి ప్రియుడైనవాఁడు.

మానవులలో పలువురు వారివారి ప్రారబ్ధములను పూర్ణముగ ఓర్పుతో సహింపఁదలఁపరు దుష్కర్మ ఫలానుభవమును తప్పించి, సుఖ సంతోషములను సమకూరుమని దైవమును ప్రార్థింతురు. కొందఱు విద్యలను కూర్చుమని ప్రార్థింతురు. విద్యావంతులై దైవానుగ్రహము సంపాదించి, భాగ్యభోగములను, ఐహిక సుఖసంతోషముల బడయఁ గోరుచుందురు. బాబా తెలిపినటుల తానీయఁదలఁచిన దానిని కోరుటకెవరువత్తురా! యని నిరీక్షించుచున్నను- దానిని కోరుటకు ముందడుగు వేయువారు లేరు. అవ్యాజకరుణా సింధువు- ఏకైక

బంధువగు శ్రీసాయీ మహాప్రభువు అట్టివానికొఱకై యెంతయేనియు వేచియుండును.

## 7. శ్రీమద్భగవద్గీత - అక్షరపరబ్రహ్మయోగము

అంతకాలే చ మామేవ స్మరన్ ముక్త్వా కలేబరమ్
యః ప్రయాతి సమద్భావం యాతినాస్త్యత్ర సంశయః (8-5)

ఎవండు అంత్యకాలమున నన్నే స్మరించుచు తనువును విడుచునో వాండు నాభావమును పొందుచున్నాండు. (నన్నే జేరుచున్నాడు). ఈ విషయమున సందేహము లేదు.

ప్రయాణ కాలేమనసాఽచలేన భక్త్యా యుక్తో యోగ బలేన చైవ
భ్రువోర్మధ్యే ప్రాణమావేశ్యసంయక్ సతంపరంపురుషముపైతి దివ్యమ్. (8-10)

అంత్యకాలమునందు చలింపని మనస్సు కలిగి భక్తియుక్తుండై యోగ బలమున చక్కగ ప్రాణమును కనుబొమ్మలమధ్య నిలుపంజాలు వాండు పరమ పురుషుండగు దైవమును పొందుచున్నాడు.

ఓమిత్యేకాక్షరం బ్రహ్మవ్యాహరన్ మామనుస్మరన్
యః ప్రయతిత్యజన్ దేహం సయాతి పరమాంగతిమ్.(8-13)

నన్ను స్మరించుచు శబ్దబ్రహ్మము ఏకాక్షరమగు ఓమ్ (ఓంకారమును) ను ఉచ్చరించుచు తనువును పరిత్యజించువాండు పరమపదమును దైవ మును పొందుచున్నాడు.

**శ్రీసాయిగీత :-** నిత్యము సిద్ధ సత్పురుషులను సందర్శింపుము. చక్కని నైతిక ప్రవర్తనముఁగలిగి యుండుము. అపుడు దేహావసాన సమయమున పవిత్రుండవగుదువు. అవసానకాలమున ఏవిధమైన కోరికలు కలిగియుండకుము. ఇష్టదైవమునందు మనస్సు నిలుపుము. నీమనస్సు నీయిష్ట దైవమునందు లయించి యున్నపుడు మృతి గలిగిన నీవు ముక్తుండవగుదువు. (సా. బో. 123)

'యల్. కె. నూల్కర్' అవసానకాలము అతి శీఘ్రముగ సమీపించెను. తుది గడియలందు ఆయన వినునటుల పవిత్రగ్రంథములు చదువఁబడెను. బాబా పాదతీర్థములాయన కీయఁబడెను. బాబాను ధ్యానించుచు నూల్కర్ ప్రాణములను విడిచెను.

సా. బా :- (నూల్కర్ మృతినిఁగూర్చి తెలుపుచు) తాత్యా! నూల్కర్ (మనకంటె) ముందుగ వెళ్లినాఁడు. నేను నియమించినటుల నతఁడిచట నుండెను. అతఁడు సద్గతిని పొందినాఁడు. ఇఁక అతనికి జననము లేదు. (సా. బో. 333)

**వివరణము :** మనస్సునందు పవిత్రములైన తలంపుల నెల్లవేళలఁ గలిగియుండునట్లు చేసికొనవలెనని బాబా మనకు బోధించినాఁడు. దైవమునుగూర్చి ఆ తండ్రి మహత్త్వమును గూర్చి సర్వదా తలంచుచు గాఢవిశ్వాసము వహించి, సాధు సత్పురుష దర్శన స్పర్శన సంభాషణలందు మగ్నులరైన చాలునని వివిధములైన ప్రార్థనలు - పూజలు మొదలగు బాహ్య కార్యకలాపములతో నిమిత్తములేదనియు శ్రీ సాయిప్రభువు తెలిపినాఁడు. ఇటుల నిరంతరము దైవచింతనాభ్యాసము పెంపొందుకొనఁది అవసానకాలమున అది ఫలించి తీరునని అటుల నిరంతర దైవధ్యాన పరునకు తుదిక్షణమునను దైవ స్మరణము సహజముగ ప్రాపించి తీరునని మనము గ్రహింపవలయును. దాని ఫలము జనన మరణ రహిత పరమ పదప్రాప్తి శ్రీకృష్ణ భగవానుఁడు శ్రీ సాయినాథుఁడు నిర్వచించినట్లు సద్గతి అట్టివానికి లభించును. ఇందు సందేహము లేదు.

మరణ సమయము తుది పరీక్ష. ఈ జీవితమునుండి భవిష్యజ్జీవితమున కందించుకూర్పు. ఆ క్షణమున మన మనస్సు వర్తించు స్థితి ననుసరించి భవిష్యజ్జీవితము ప్రాప్తించును. తుది క్షణమున మనస్సు దైవాభిముఖమై దైవధ్యానముతో ప్రాణముల విడుచునతఁడు తిరిగి పుట్టుకులేని దైవసన్నిధానమును పరమపదమును పొంది తీరును.

## 8. శ్రీ మద్భగవద్గీత - రాజవిద్యా రాజగుహ్యయోగము

అనన్యా శ్చింతయంతో మాం యేజనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్. (9-22)

ఇతర మేదియుఁ దలపక ఏకాంతభక్తితో నన్ను శ్రద్ధతో సేవించుచు నాయందు లెస్సగ లగ్నమైన మనస్సు గలవారికి విహితములగు యోగము (లేనిదానిని సమకూర్చుట) క్షేమము (కలిగినదానిని రక్షించుట) సమకూర్చు భారము వహింతును.

పత్రం పుష్పం ఫలం తోయం యోమే భక్త్యా ప్రయచ్ఛతి
తదహం భక్త్యుపహృత మగ్నామి ప్రయతాత్మనః (9-26)

ఎవఁడు భక్తితో పత్రమేని, పుష్పమేని, ఫలమేని, జలమేని సమర్పించునో అట్టి నిష్కామ భక్తుఁడౌ వాఁడు సమర్పించిన దానిని (కానుకను) మిక్కిలి ప్రీతితో నారగింతును.

యత్కరోషియదశ్నాసి యజ్జుహోషిదదాసియత్
యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వమదర్పణమ్. (9-27)

అర్జునా! నీవు చేయుదానిని, తినుదానిని, వేల్చుదానిని, దానము చేయుదానిని నీవు కావించు తపస్సును సకలము నాకు సమర్పింపుము. (ఆ యా కర్మముల ఫలము నాకు సమర్పింపుము)

అపిచేత్సుదారాచారో భజతే మామనన్యభాక్
సాధురేవ సమంత వ్యస్సమ్యగ్వ్యవసితోహిసః (9-30)

(అంతకు పూర్వము) అత్యధిక పాపవర్తనుఁడేయైనను ఏకాంత భక్తి కలిగి నన్ను సేవించువాఁడు దృఢభావముతోఁ గూడినవాఁడగుటచే సాధువు - అనియే తలంపఁదగును.

మన్మనాభవ మద్భక్తోమద్యా జీమాం నమస్కురు
మామే వైష్య సియుక్త్వైవ మాత్మానం మత్పరాయణః (9-34)

నాయందు నీ మనస్సు నిలుపుము! నాయందు భక్తి గలిగి యుండుము. నను యజింపుము. నను నమస్కరింపుము. ఈ విధముగ నీ ఆత్మను నాయందు లగ్నము చేసినవాడవై నన్నే పొందుచున్నాడవు.

శ్రీ సాయీగీత : అనన్యభక్తితో నన్ను చింతించుచు, నన్ను శరణు పొందినవానికి నేను ఋణపడినవాడను. నా ప్రాణమైన వెచ్చించి వాని రక్షించి తీరుదును. (సా. బో. 13)

నీ సకల సంకల్పములకు నన్నే ఏకైక లక్ష్యముగా జేసికొంటివేని నీవు పరమార్థమును బడయగలవు. నన్ను చూడుము! నేను నిన్ను చూతును. (సా. బో. 19)

తన భారముల నాపై నిలిపి నన్ను చింతించువానిని సర్వవిధముల ఆదుకొని రక్షింతును. (సా. బో. 25)

నేనిక్కడ నుండ నెవరేని ఏల భయపడవలె? (సా. బో. 33)

1914 శ్రీరామ నవమియందు లక్షల జనము బాబా చుట్టు జేరిరి. ఒక్క వృద్ధురాలు బిగ్గరగ అరుచుచుండెను. వృద్ధురాలు; ఓ బాబా! ఈ మునలిదానిపై కరుణింపుము. నీ దర్శనము నాకు ప్రసాదింపుము.

బాబా పనుపున శ్యామా వెళ్ళి ఆ మునలిదానిని బాబా దరికి తీసుకొని వచ్చెను. నాకేమి తెచ్చితివని బాబా అడిగెను. వృద్ధురాలు "ఇదిగో చలిది రొట్టెముక్క-ఉల్లిగడ్డ. నేనొకరొట్టె రెండు ఉల్లిగడ్డలు తీసుకొని బయలుదేరితిని. ఈ ఉదయమున ఆకలినొంది సగము రొట్టె నొక ఉల్లిగడ్డను భక్షించితిని. శేషించినవి యివిగో! వీనిని నీవు భక్షింపుము." బాబా ఆ చప్పని రొట్టెముక్కను అత్యంత ప్రీతితో నములుచు "అమ్మా! నీ రొట్టె ఎంత మధురముగా నున్నదో?" అనెను.

(సా. బో. 510)

నాయందెల్లప్పుడు మనసు నిలిపి, నాకు ముందుగ సమర్పింపక యే లవమేనియుఁ జవిచూడని వానికి, నాయందు ప్రేమ విశ్వాసములఁ బఱపుచు, నాకొఱకై క్షుత్పిపాసలు గని, యితరమేదియు లెక్కఁడకుండువానికిని నేను బానిసీడనగుదును. (సా. బో. 14)

నీవు భోజనము సేయునప్పుడు నన్ను తలంతువా? నేను నీ చెంగట లేనా? నీ వాకమెతుకైనా నాకర్పింతువా? (సా. బో. 79)

(అపరాధులయెడను బాబా కరుణ)

1915 దసరాలో నొకదినమున బాబా కాకా దీక్షిత్తుతో నిట్లనెను. “కాకా! మన దర్బారునందు మంచివారివలె చెడ్డవారును చేరుదురు......ఒక గుమస్తావచ్చి బాబా పాదముల వ్రాలెను. ఆ గుమస్తా అతని యజమాని ధనము నపహరించిన కారణమున ఒక “వారంటు” జారీ చేయఁబడియుండెను. ... ... బాబా బోధలను పాటించి, తన నేరమును ఆ గుమాస్తా అధికారులకు తెలుపుకొనెను. ఆతని యజమాని ఆ గుమాస్తాను స్వల్పశిక్షతో విడుదల చేయించెను. (సా. బో. 563)

ఎల్లప్పుడు నీవు సత్యధర్మాధారముగ సంచరింపుము. నీవెక్కడ నున్న నెల్లవేళల నిన్ను విడువక నీవెంట నుందును. (సా.బో. 11)

వివరణము : ఇచట పాఠకులు భగవద్గీతలో 22వ శ్లోకములోని “అనన్యాశ్చింతయంతో మాం ...” భావమును తరువాత పలుకఁబడిన శ్లోకములను దృష్టియం దుంచుకొని చదివినగాని యందలి భావము చక్కఁగ బోధపడదు. బలీయమై సర్వత్రా వ్యాపించిన వాయువు ఆకాశమునం దణఁగియున్న విధమున ఈ సమస్త విశ్వము నిరాకారుఁడైన తనచే వ్యాప్తమై యున్నదని, అఖిల జీవములు తన యందే చేరియున్నవని శ్రీకృష్ణుఁ డర్జునునకు బోధపఱచెను. ఈ విశ్వ సృష్టి స్థితిలయములకు తా నేకైక కారణమయ్యుఁ దానెట్లు వికార

రహితుఁడై యున్నదియు విశదపఱచెను. అటులగుటఁ దాను లేనిది ఈ విశ్వమున పరమాణువైనను లేదని తెలిపెను. ఇట్టి సర్వవ్యాప్తి- సర్వ నియంత - సర్వాంతర్యామి - సర్వేశ్వరుఁడగు భగవానునందు అనన్య భక్తిగలిగి సేవించువారికిహ పర సుఖ శాంతుల ప్రసాదించుచు యోగ క్షేమ భారము వహించుచు ఆ పరాత్పరుఁడు రక్షించితీరును.

భగవానుఁడు- శ్రీ సాయీప్రభువు కోరునది నిర్వంచిత భక్తి- నిరతి యాసక్తి మాత్రమే. ఇతర బాహ్యాడంబరములతో ఆ తండ్రికి నిమిత్తము లేదు. భక్తుఁడు భగవానున కర్పించు వస్తువుయొక్క- విలువ - బాహుళ్యము ప్రధానము కాదు - సమర్పణ కృతియందు తనవాఁడు ప్రకటించు ప్రేమ - ఆసక్తి - ముఖ్యములు.

పైనఁ దెలుపఁబడిన భగవద్గీతా శ్లోకములు బాబా ప్రబోధముల ననుసరించి యీ విషయము పాఠకులు గ్రహింపఁదగును. స్వార్థ ప్రయోజనాసక్తి - కర్మ ఫలాపేక్ష విడిచి, సర్వాంతర్యామియగు పరమాత్మను దలంచుచు ఆ తండ్రి ప్రీత్యర్థము మనమెట్లు కార్యముల నాచరింపఁదగును. మనము కావించు కర్మముల ఫలముతో మనకు సంబంధము లేదు. కర్మ ఫలత్యాగ రూపములగు మన తలంపులె మనకు విముక్తిఁగూర్చును. నిస్వార్థ బుద్ధిగలిగి, కర్మఫలములను ఆశింపక నిరంతర మేదొక మంచిపని చేయువానిని ఆ యా సత్కర్మములు పవిత్రునిఁ గావించి భగవానుని కరుణకుఁ బాత్రునిఁజేసి మహోన్నత స్థితికిఁ గొనిపోవును. అటుల నిస్స్వార్థ - నిష్కామ బుద్ధితో కర్మము లాచరించుచున్నను అవి సాంఘిక నైతిక ధర్మములకు విరుద్ధములుగ నుండరాదు. ఇటుల పరమాత్మయెడ అనన్య భక్తి కలిగి, సంకుచిత స్వార్థ కర్మఫలాపేక్షల త్యజించు జీవిని సకల కర్మబంధ విముక్తునిఁ గావించును.

భగవద్గీతలందుఁ దెలుపఁబడిన నిగూఢార్థములను బాబా మనకు సుబోధ మగునటుల జేయుటకు "నీవు భుజించు సమయమున నన్ను

దలంతువా ? నీదగ్గఱ నేనున్నది గుర్తించుదువా ? నీ మొదటి ముద్ద నా కర్పించుదువా ?" అను పలుకులతో నతి మనోహరముగ మనకు బోధపఱచినాడు.

ధనాపహారణమను నేరము మోపఁబడిన గుమాస్తాను దృష్టాంతముగఁగొని, యెట్టి పాపియైన దాను గావించిన నేరమునకు వాస్తవముగ పశ్చాత్తాపమొంది, భగవానుని త్రికరణశుద్ధిగ శరణొందెనేని, ఆ యా దుష్కర్మముల ఫలముల ధైర్యముతో నెదుర్కొనఁ జేవి, యిందే యీ పుట్టువునందే, సకల కర్మబంధ విముక్తిఁ బడయఁజాలునని బాబా మనకు బోధించినాఁడు.

## 9. శ్రీమద్భగవద్గీత – విభూతియోగము

అహమాత్మా గుడాకేశ సర్వభూతా శయస్థితః
అహమాదిశ్చ మధ్యంచ భూతానామంత ఏవచ. (10_20)

అర్జునా ! ఎల్లభూతముల హృదయములందున్న ఆత్మను నేనే. సకల భూతముల ఆదిమధ్యావసానములు నేనే !

అధవా బహునైతేన కాజ్ఞానేన తవార్జున
విష్టభ్యాహ మిదంకృత్స్న మేకాంశేన స్థితో జగత్. (10_42)

అర్జునా ! ( నా విభూతినిఁగూర్చి యిది యని చెప్పనేల ? ) బహువిధములైన యిట్టి జ్ఞానము (ఎఱుక) తో నీకేమి ప్రయోజనము? ఈ సమస్త జగమును నాఏకాంశముచేతనే నిలుపుకొనుచున్నాఁడను.

శ్రీ సాయీగీత : బాబా సహజ స్వభావ శక్తి-సామర్థ్యములు : నేను దైవమును (అల్లా) నేను మహాలక్ష్మిని– ఈ మసీదున గూర్చున్న నేను సత్యమును పలుకుదును. (సా. బో. 58)

నేను శ్రీకృష్ణుఁడను ... (సా. బో. 59)

నేను పర్వర్దిగర్ (దైవము) అగుదును. నేను షిరిడి యందును ఎల్లెడల నుందును. నా వయస్సు లక్ష సంవత్సరములు. (సా. బో. 62)

ఈ విశ్వము సర్వము నాయందున్నది. (సా. బో. 64)

నేను నిరాకారుడను. ఎల్లెడల నున్నవాడను. నేను ప్రతి వస్తువునందు నున్నవాడను. నేను ప్రతి పదార్థమున దాని కావల నున్నవాడను. నేనాకాశము నలుదిశలు నిండియున్నవాడను. నీ దృష్టి గోచరమగునది సకలము నేనే. నేను చలింపను, కదలను. (సా. బో. 66)

**వివరణము :** ఈ సందేశము శ్రీకృష్ణభగవానుడు మనకు అందించిన శ్రీ సాయిబాబా అందించిన దొక్కటే. ఆది మధ్యాంతములందు పరిణామములు (మార్పులు) పొందు ఈ విశ్వమునందెల్లెడల - సకల స్థావర జంగమముల నధివహించు "విశ్వాత్మ" ఒక్కడే. ఆ పరమాత్మయే యీ విశ్వమును జాగ్రుతియై వీక్షించుచు, పోషించుచు ప్రవర్తింపజేయుచుండును. ఆ పరమాత్మ విభూతియందు అల్పమో అధికమో ప్రతి వస్తువునందు ప్రకటమగుచునే యుండును. శోభితములై, ఐశ్వర్య బలాదులుగలిగి యీ విశ్వమున బొడకట్టు వస్తువులు ప్రత్యేకించి ఆ విశ్వాత్మయొక్క అధిక తేజోంశ సంభవములుగ మనము భావించి సేవింపదగును.

కాని చిత్తశుద్ధిగలిగి యథార్థ జిజ్ఞాసగల సాధకున కీ ప్రతిబింబములతో నే క్షణమేనియు నిలువలేడు. "విశ్వాత్మ కలడు. ఆతడే యీ సకల విశ్వము నావరించి, భరించుచున్నాడు. ఆ ప్రభువే యీ సర్వ విశ్వమునకు సకలము సమకూర్చుచున్నాడు" అను సత్య సిద్ధాంతమును సాధకుడు మనస్సునందు పాదుకొలుపుకొనదగును.

## 10. శ్రీమద్భగవద్గీత - విశ్వరూపసందర్శనయోగము

ఇహైకస్థం జగత్కృత్స్నం - పశ్యాద్య సచరాచరమ్ ।
మమదేహే గుడాకేశ యచ్చాన్యద్ద్రష్టు మిచ్ఛసి. (11-7)

ఓ అర్జునా ! ఇట, చరాచరాత్మకంబైన సమస్త జగమును, ఇంకను నీవేమిచూడ నభిలషించుచున్నాడవో వాని నన్నిటి నొక్కచోట నిక్కడ జూడుము.

స్థానే హృషీకేశతవప్రకీర్త్యా జగత్ప్రహృష్యత్యనురజ్యతేచ
రక్షాంసి భీతానిదిశో ద్రవంతి సర్వేనమస్యంతిచసిద్ధ సంఘాః (11-36)

ఓకృష్ణా! నీయొక్క గొప్పకీర్తిచే జగమంతయు మిక్కిలి సంతసించుచు నీయందు మిక్కిలి అనురాగము పొందుచున్నది. రాక్షసులు భీతిచే నెల్లదిశలను పాఱిపోవుచున్నారు. సకలసిద్ధసంఘములు నమస్కృతులు గావించుచున్నవి.

అదృష్టపూర్వం హృషితోఽస్మి దృష్ట్వా
ప్రసీదదేవేశ! జగన్నివాస! (11-45)

మున్నెన్నఁడు చూడని రూపమును జూచి సంతోషించుచున్నాఁడను. భయముచే నామనస్సు చలించుచున్నది. ఓజగన్నివాసా! దేవ! దేవ! శ్రీకృష్ణ! నీపూర్వరూపమును మరలఁజూపి అనుగ్రహింపుము.

**శ్రీసాయీగీత :** ఈవిశ్వము సర్వము నాయందున్నది. (సా.బో.64)

నీదృష్టిగోచరమగునది సకలము నేనే ... (సా.బో.66)

బాలకృష్ణ గోవింద ఉపాసనీ ... బాబా! నిన్ను సందర్శించిన సకలదేవతలను సందర్శించినవాఁడనే (సా. బో.355)

"......గవర్నరు బల్లెముఁజేఁబూని దాదాను (జి. యస్. ఖపర్డే) పొడువవచ్చెను. నేనాతని ప్రతిఘటించి తరిమివైచితిని. తుద కాతని సమాధానపఱచితిని. నేనిక్కడ నుండ నెవరేని ఏల భయపడవలె? (సా. బో. 83)

**వివరణము :-** శ్రీమద్భగవద్గీతలందు ఈ విశ్వరూప సందర్శన యోగమును ప్రతిపాదించు ఈయధ్యాయము ఉత్తమోత్తమము. జ్ఞాననేత్రమున అర్జునుఁడు చూచినట్లే ప్రతి సాధకుఁడు సద్భక్తిపూర్ణమగు బుద్ధితో చూడననుగ్రహింపఁబడుచున్నాఁడు. ఈదృశ్యము మనకమూల్య పాఠమును బోధించుచున్నది. ఈమనుష్య సందోహము యొక్క అకించనత్వము-భగవానుఁడు తనయొక్క విశ్వవ్యాపకత్వ

మును- సర్వైశ్వర్యత్వమును మనకన్నులకుఁ బొడగట్టచేయుచున్నాడు. ఆమహాప్రభువనుగ్రహించి, అవ్యాజ కరుణాలేశము ప్రసరించినతప్ప, ఈమానవుఁడెన్ని విధముల కృషిచేసినను, ఆ సర్వేశ్వరునిఁజూచుటకుఁ జేరుటకు అర్హుఁడు కాఁడని యిట విశదమగుచున్నది.

ఒక చలనచిత్ర ప్రదర్శనమందు కనఁబఱచినటుల భారతయుద్ధ భూమినంతయు- ఈసకల విశ్వమును తన భక్తుఁడగు అర్జునుని దృష్టిపథమునకుఁగొనివచ్చుట- మనము సావధానముగ విచారించితి మేని, అర్జునునకు- తద్వారా మనకును "ఈ సమస్త విశ్వము తన ఇచ్ఛానుసారము ప్రవర్తించు చున్నదనియు, మనమేమి యొటులఁగావించుచున్నను. ఆభగవానుని చేతిలోని ఉపకరణములవలె ఆతండ్రి సంకల్పానుసారము ప్రవర్తించుచున్న వారమేయని- ఆస్వామి స్వాతంత్ర్యము- మనపారతంత్ర్యము మనకు బోధమగుచున్నది.

కాని, అత్యంతాద్భుతములను ప్రదర్శించు యీప్రబోధములు మనలను పిరికిపందలను గావింపనీయరాదు. సైన్యాధిపతిని అనుసరించు భటునివలె మనము మనస్వామి ఆజ్ఞాపించిన విధులను శక్తివంచన లేని విధమున నిర్వర్తించుటకు ఉత్సాహకరములగు బోధలుగవీనిని గ్రహింపవలయును. అర్జునుడు వాస్తవముగ యుద్ధకర్మమునకుఁ ప్రేరేచఁబడెను- మన యుద్ధరంగములును పలువిధములు. అవి మన వెలుపల లోపల చెలరేగు యుద్ధసీమలు.

శ్రీసాయీనాధుఁడు ఉపాసనీ మహారాజునకు పెక్కు దృశ్యములఁగనఁబఱచెను. ఉపాసనీ బాబా తన ఆకారమును- కాలమేఘము వంటె నల్లనిరూపమును జూచెను. శ్రీసాయీశుఁడొక గుదియఁజేఁబూని ఆ నల్లని రూపమును చావమోదెను. ఉపాసనీభయ భ్రాంతులొంది "బాబా! నన్ను చంపకుము- చంపకుము" అని యేడ్చెను, "ఆ చంపబడినది నీ పాపరూపము" అని బాబా అనునయించెను. సకల పాప విముక్తినొందుటచే కాశీనాధ ఉపాసని పవిత్రుఁడై భగవదను

గ్రహమునకు పాత్రుండయ్యెను. ఉపాసనిని- అర్జునుడుగ భావించుడు! ఉపాసనియెదుట గోచరించిన నల్లనిరూపము అర్జునుని యెదుటబారులు తీర్చిన సేనలు. ఆదృశ్యమును గ్రహించుడు। శ్రీకృష్ణభగవానుడు తన భక్తుడగు అర్జునునకు అవ్యక్తమార్గమున బోధించినదే మనదేశ కాలపాత్రల పరిస్థితుల కనుగుణముగ బాబా బోధించినాడు.

అర్జునునకు భగవానుడు కనబఱచిన విశ్వరూపము "ఆమహా ప్రభువే యీవిశ్వమునంతట ఆవరించి యున్నవాడు" అనుమహాసత్యమును- (పరమార్థమును) బోధించుచున్నది. అర్జునుడు విశ్వాసము వహించి స్వానుభవమున తెలిసికొని, వెలిడబలికినది గమనింపుడు! "ప్రసీద- దేవేశ! జగన్నివాస!" అని, ఆప్రభువు జగన్నివాసుడు. ఈవిశ్వమునకు నివాసస్థానము- ఋషులు- దేవతలు- మహాపురుషులు ఆతండిని స్తోత్రములచే వినుతించు చున్నట్లును — ఈవిశ్వ సక్రమ ప్రవర్తనములందు- విశ్వ పరిపాలనమునందు విరుద్ధముగ భగవానుని ప్రతిఘటించు దుష్ట శక్తులనన్నిటిని ఆప్రభువెటుల విధ్వంసముచేయు చున్నది యీవిశ్వరూప సందర్శనము మనకు బోధించుచున్నది.

అర్జునుడు శ్రీకృష్ణభగవానుని "జగన్నివాస!" అని సంబోధించినట్లు బాలకృష్ణ గోవింద ఉపాసని (పూనాకళాశాలలోసంస్కృత భాషాచార్యుడు) శ్రీసాయీప్రభువును సందర్శించి "బాబా! నీవు సర్వేశ్వరుడవు. నీవు సర్వదేవతా స్వరూపుడవు. నిన్నుసందర్శించిన మాత్రమున సకల దేవతా సందర్శన భాగ్యము లభించినది." అని, విన్నవించుకొనినాడు.

సకలభయముల- ఆపదలనుండి బాబా తన భక్తులను రక్షింపజాలిన సమర్థుడగుటచేతనే "నేనిక్కడనుండ నెవరేని ఏల భయపడవలె?" అని పలుకజాలినాడు. చరిత్ర పునరావృత మగుచుండునని

తెలుపుటకే శ్రీకృష్ణభగవానుఁడు శ్రీసాయీనాథుఁడుగ అవతరించినాఁడు. సర్వేశ్వరుఁడు శ్రీకృష్ణభగవానుఁడుగ గీతలందు బోధించిన విషయములనే మరల ఆసర్వస్వామి శ్రీసాయీబాబాగా నవతరించి, తన భక్తులందఱకు అనుభవరూపముగ ఆబోధలను విశదపఱచినాఁడని ఎల్లరు గ్రహింపఁదగును.

## 11. శ్రీమద్భగవద్గీత - భక్తియోగము

మయ్యావేశ్య మనోయేమాం నిత్యయుక్తా ఉపాసతే
శ్రద్ధయా పరమోపేతా స్తేమేయుక్తత మామతాః (12-2)

మనస్సునాయందు నిలిపి, నిత్యయుక్తులై మిక్కిలి శ్రద్ధతో నన్నుపాసించు వారు యోగిపుంగవులని నా అభిప్రాయము.

యోనహృష్యతి నద్వేష్టినశోచతి నకాంక్షతి
శుభాశుభపరిత్యాగీభక్తిమాన్యః సమేప్రియః (12-17)

హర్షము ద్వేషము దుఃఖము కోరికలేనివాఁడు మంచిచెడులను రెంటిని పరిత్యజించునట్టి భక్తుఁడు నాకుప్రియమైనవాఁడు.

సమశ్శత్రౌచమిత్రే చ తథా మానావమానయోః
శీతోష్ణ సుఖదుఃఖేషు సమస్సంగ వివర్జితః (12-18)

శత్రులందు మిత్రులందు గౌరవమున అగౌరవమున చలివేడుముల సుఖదుఃఖముల సమబుద్ధిగలిగి (దైవమునకంటె) ఇతరములందు సంగములేనివాఁడై

తుల్యనిందాస్తుతిర్మౌనీ సంతుష్టోయేనకేనచిత్
అనికేతః స్థిరమతిర్భక్తిమాన్మే ప్రియోనరః (12-19)

నిందించిన స్తుతించిన సమముగ భావించి, మౌనియై దేననైనను తృప్తి నొంది, ఒక నెలవులేనివాఁడై, స్థిరమైన బుద్ధిగల నాభక్తుఁడు నాకు ప్రియమైనవాఁడు.

శ్రీసాయీగీత :- సా. బా. :- నీతలంపులకు నన్నొక్కైక లక్ష్యముఁ జేసికొంటివా నీవు పరమార్థముఁ బడయఁగలవు. చలింపని శ్రద్ధతో నన్నుజూడుము! నేను నిన్నుజూతును. చతుర్విధ సాధనములతో ఆరు శాస్త్రములతో నీకు అవుసరములేదు. గాఢమైన విశ్వాసముతో (శ్రద్ధతో) నీగురువును విశ్వసింపుము. అదిచాలును. (సా. బో. 137)

సా. బా:- కావున సకల కామితముల పరిత్యజించి, సకలమున అధివసించియున్న దైవమునందు నీ మనస్సును నిలువుము. మనస్సు ఆవిధముగ కేంద్రీకరింపఁబడిన గమ్యము సిద్ధించును. (సా. బో. 138)

సా. బా:- అతఁడు నాకు విరోధియని యెవరినిగూర్చియు పలుకకుము. ఎవఁడు ఎవనికి శత్రువు? ఎవనియెడలను ద్వేష భావమును నీహృదయమునఁ జేరనీయకుము. (సా. బో. 110)

సా. బా:- ఇతరులతో కలహింపకుము. ఇతరులునిందించిన ఓర్పువహింపుము. శాంతవచనములు పలుకుము. ఇది సుఖప్రాప్తికి మార్గము. ఇతరులు-ప్రపంచము తల్లక్రిందులు కానిమ్ము, దానిని నీవు పాటింపక, ముక్కుకు సూటిగ నీ మార్గమునఁబొమ్ము (సా.బో. 140)

సా. బా: మన తలంపులను ఆయన కధీనములఁ గావించి ఆయన మనలనిలుపఁదలఁచిన విధమున నిలుచుటకు సంతృప్తి నొందుదము. "అల్లారఖేగా వైసా రహేనా". ప్రాప్తించిన దానిని స్వీకరింపుము. సంతృప్తి సంతోషములఁ బొందుము (సా. బో. 267)

వివరణము : భక్తిమార్గమున (యోగమున) గాఢము-అత్యంత ప్రతి పాత మైన విశ్వాసము-స్థిరత్వము - ధ్యాననిష్ఠ అవసరము. ప్రభువుయందు అచంచల విశ్వాసము సంపాదించు కొనవలయును. ఎట్టి విషమ పరీక్షయందైన ఆ విశ్వాసమును సడలనీయకుండుటయే కాక స్వామి పాదపద్మముల యందు దానిని కేంద్రీకరించ వలయును. అదియే యుత్తమోత్తమ భక్తియని చెప్పఁబడును. ఇట్టి స్థానమును జేరుకొనఁగల సాధకులు ప్రభువు దృష్టియందు "ఉత్తమ యోగ విత్తములు"- యోగిశ్రేష్ఠులు. అట్టి నిర్వ్యంచిత - నిశ్చల ప్రేమికుల భక్తిని ప్రాకృత విషయము లేవియును లోభపఱుపఁజాలవు. వారు సుఖదుఃఖాది ద్వంద్వములందు సమబుద్ధి వహింపఁగలరు. ఎవరి యందును ద్వేషబుద్ధినిఁజూపరు. ప్రపంచమునఁబొలుచు మంచిచెడుగు లకు వేనికిని అధీనులుకారు. అట్టివారే దైవభక్తి ప్రపూర్ణులని- ఏకాంతభక్తులని చెప్పఁదగినవారు.

బాబా తన ఆశ్రితులను అట్టిభక్తి నభ్యసింపుఁడని పలు మాఱులు బోధించినాఁడు. శ్రీ సాయీశు నందు భక్తి కామ నాశూన్యముగ నుండవలయును. ఆ తండ్రియే తనబిడ్డల "యోగ క్షేమము"ల భారము వహింతునని శపథముఁజేసినాఁడు. అట్టి నిష్కామ నిశ్చలభక్తితో బాబాను సేవించితిమా - సాధన చతుష్టయము-ఆరు శాస్త్రముల నభ్యసింప వలసిన పనిలేదు. మన దృఢభక్తి బలముననే తక్కిన శాస్త్రమార్గానుయాయుల నధిగమించగలము. ప్రాపంచక విషయలంపటులమై, వెలికిమాత్రము భక్తి ప్రదర్శించితిమా-అది ఆత్మవంచనము (తన్నుతానే వంచించుకొనుట) అని బాబా తెలిపి నాఁడు పామరులైన లోకులను వంచింపఁగలమేమోకాని, హృద యస్థుఁడు-సాక్షియైన ఆ స్వామిని వంచింపలేముగదా! బాబా మన వలన కోరునది సకలవాంఛా పరిత్యాగము. సకల భూతాంతర్యామి

నైన శ్రీవాసుదేవ సాయీప్రభువునందు మనస్సును కేంద్రీక రించుట మాత్రమే.

మనకు దృగ్గోచరములగు సకల జీవములందు తానధివసించి యున్నటుల తన భక్తులకు బాబా అనుభవరూపమున ప్రదర్శించి నాడు. అటుల ప్రదర్శించుట ఐంద్రజాలికునివలె తనశక్తిని జన సమూహమునకుఁ బ్రదర్శించు కాంక్షతో కాదు. తన బిడ్డలు చిలుక పలుకులవలె శాస్త్ర ప్రవచనములఁబలుకు కొనుచు సంతృప్తినొందుట మాత్రమే కాక, వారివారి అనుభవములందు తమ గురుదేవుఁడగు శ్రీ సాయీనాథుఁడు సర్వభూతాంతర్యామియే అను ఎఱుకను దృఢముగ పాదుకొనఁజేయుటకే. అదియే శ్రీసాయీ అవతారమునఁ గల ప్రత్యేకత-మహత్త్వము-నని పాఠకులు గ్రహింపఁదగును. బాబా పలుకునది చాల స్వల్పము. గీతా ప్రబోధములను అనుభవరూపమునఁ దన ఆశ్రితులు గ్రహించి నిత్యాచరణమునందుంచు కొనుటకు తగిన అవకాశములను-సంఘటనములను ఆ తండ్రి కల్పించువాఁడు.

ఆధ్యాత్మిక జీవన మొక మహాసంగ్రామ మనఁదగును. వివిధ శత్రుసైన్యములను ఈ వ్యక్తి యెదుర్కొన వలయును. విశ్వా మిత్ర మహర్షి యొక్క వృత్తాంతమే యిందుకు నిదర్శనము. మేనక యెదుటఁబొడమగా కామమునకు లోగినాఁడు. తరువాత ఊర్వసి తన సౌందర్యవిలాసములచే నా మహర్షిని ఆకర్షించి, తన కైవసముఁజేసి కొన యత్నించగా, క్రోధమునకులోఁగి ఆమెను శపించి, ఆ క్రోధ కారణమున తాను పెద్దకాలము కావించిన తపఃఫలితమును గోల్పోయి నాఁడు. భగవానుఁడు గీతలందు "ఇట్టి కామక్రోధాదులకుఁ బొల్పడక దూరముగఁ దొలఁగవలయునని సాధకులకు బోధించినాఁడు. శ్రీ సాయీనాథుఁడును తనబిడ్డలకు బోధించినదియునిదియే. వీనిని

(కామాదులను) ప్రతిఘటించుట కేకైకమార్గము సకలభూతాంత ర్యామియగు శ్రీసాయీకృష్ణ భగవానునం దేకాంతభక్తిని పెంపొం దించుకొనుటయే. నిందావమానాదులను పొందినపుడు ప్రతీకార వాంఛయే అత్యధికముగ అంతర్బహిశ్శత్రువుల నుద్రిక్తులఁగావించును. సాధకుఁడు సహనబుద్ధిఁగలిగి అట్టి వానిని తన జీవితమున పాటింపక (లెక్కింపక) నిలువఁగలుగుటయే తుది విజయమునకు రాజమార్గమై యున్నది. అనఁగా సుఖదుఃఖాది ద్వంద్వములను సహింపఁగల సాధకు నకు జయము సత్యముగఁ జేకురును. అట్టిదానిని 'సహనము' అనిన- 'క్షమ'-అనిన, "అపకారమునకుపకారము" అనిన అట్టిస్థితికి ఏపేరు పెట్టిన లోపము లేదు. ప్రపంచ దృష్టియందు తొలుత వాఁడు పరా జితుఁడుగఁగనఁబడినను ఆసహనము-ఓర్పు - వానిని తుదకు విజయ వంతుని గావించును. సత్యముగ భగవద్భక్తుఁడైన వాఁడు తన ప్రభువును-గురుదైవమును, సర్వత్రజూడఁగలఁడు. ఆకారణమున దేనిని ద్వేషింపఁడు. ఏ జీవియందును పగఁబూనఁడు. దేనికిహానిఁ గలిగింపఁగోరఁడు,

## 12. శ్రీమద్భగవద్గీత - క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగము

> ఇదంశరీరం కౌంతేయ క్షేత్రమిత్యభిధీయతే
> ఏతద్యోవేత్తితం ప్రాహుఃక్షేత్రజ్ఞ ఇతితద్విదః (13.2)

అర్జునా! ఈ శరీరము "క్షేత్రము" అనిచెప్పఁబడును. ఇట్టిదేహరూప మైన క్షేత్రమును తెలిసికొనఁజాలిన వానిని "క్షేత్రజ్ఞుఁడు" అని ప్రాజ్ఞులు పలుకుదురు.

> క్షేత్రజ్ఞం చాపిమాం విద్ధిసర్వక్షేత్రేషుభారత
> క్షేత్రక్షేత్రజ్ఞ యోర్జ్ఞానం యత్తత్ జ్ఞానం మతంమమ (13.3)

ఈ ప్రపంచమునగల క్షేత్రములందు నన్ను క్షేత్రజ్ఞునిఁగఁ దెలిసి

కొనుము. ఇట్టి క్షేత్రము - క్షేత్రజ్ఞుని (శరీరము - ఆత్మను) గూర్చిన ఎఱుకయే "జ్ఞానము" అనినాతలంపు.

పురుషః ప్రకృతిస్థోహిభుంక్తే ప్రకృతిజాన్‌గుణాన్
కారణంగుణ సంగోఽస్యసదసద్యోనిజన్మసు. (13-2)

పురుషుఁడు ప్రకృతియందుండుటచే ఈప్రకృతి జనితములైన గుణములను (సత్వరజస్తమో గుణములను వానికి సంబంధించిన విషయములను) అనుభవించుచున్నాఁడు. ఇట్టిగుణ సంసక్తి (విషయాసక్తి) ఉత్తమ నీచగర్భముల జనించుటకు కారణమగుచున్నది.

ఉపద్రష్టాను మంతాచభర్తా భోక్తామహేశ్వరః
పరమాత్మేతి చాప్యుక్తోదేహేఽస్మిన్పురుషఃపరః (13-22)

ఈ శరీరమునం దధివసించిన శ్రేష్ఠుఁడగు పురుషుఁడు ఉపద్రష్ట (సాక్షి) అని, అనుమతించువాఁడు- అని, భరించువాఁడు-అని, ఆనందించువాఁడు- అని, మహాప్రభువు-అని పరమాత్మ అనియు పిలువఁబడు చున్నాఁడు.

యఏవంవేత్తి పురుషం ప్రకృతించగుణైస్సహ
సర్వథావర్తమానో ఽ పినసభూయో ఽ భిజాయతే (13-23)

ఈవిధమగు పురుషుని గుణసహితమగు ప్రకృతిని (బాగుగ) తెలిసికొనజాలినవాఁడు సర్వవిధముల ప్రవర్తించుచున్నను అతఁడు మరల జన్మించఁడు.

సమంసర్వేషు భూతేషుతిష్ఠంతం పరమేశ్వరమ్
వినశ్యత్స్వవినశ్యంతం యఃపశ్యతి సపశ్యతి (13-28)

సకల భూతములందు సమగతిని అధివసించి యున్నవాఁడును - దృగ్గోచరములగు తనువులు నశించుచున్నను తానుమాత్రము నశింపక

యుండువాఁడునగు పరమేశ్వరునిఁ జూచువాఁడే (లెస్సగ) చూచు వాఁడు-ఎఱుకగలవాఁడు.

**శ్రీసాయిగీత :-** (సగుణతత్త్వమున) కర్మకారణమున బద్ధుఁడనై ఒక దేహమునఁ జేరితిని నాపేరు దేహి... (సా.బో. 119)

మనమెవరము ? అని విచారణ చేసికొనవలయును. (సా.బో. 120)
నీవెవరవో ఆలోచించుకొనుము... (సా. బో. 121)

నాభక్తుఁడు నీయందు-తనయందు-సకలభూతములందు నన్ను గుర్తించును. సకలమును తనగురువుగఁ జూచును వాఁడు. నా అను భావమును (సాదృశ్యమును) పొందును. (సా. బో. 18)

**వివరణము :** స్థూల సూక్ష్మాది (భౌతిక మానసికాది) శరీరములు కలవనియు, వీనికంటెక, వీనికంటెఁ ప్రత్యేకమైన ఆత్మకలదని, మన మందఱము గ్రంథములవలన, అనుభవజ్ఞులవలన వినియే యున్నారము. ఈ విషయమున నెట్టి సందేహము లేదనియు నెఱుగుదుము. దీనికి విరుద్ధముగఁ బలుకువారలను గూర్చి పరిహాసింతుము. కాని, యిందుఁ గల చిత్రమును గమనింపుఁడు! మన అనుభవములో మాత్రము "దేహాత్మబుద్ధి" (దేహమేనేను అనుబుద్ధి) వహించి, కామాదులకు లోగుచుందుము. ఈ బాహ్యదృష్టికి ప్రపంచమున గోచరించు సౌందర్యదేహాదులే యీ కాంతాదులు కారనియు, తదంతర్భూత మును-సూక్ష్మాతి సూక్ష్మమై మనదృష్టికి గోచరమగు ఈశ్వరాంశము గలదని యెఱుఁగఁగలవారు ఎందఱుకలరు? మనము మిక్కిలి ప్రేమించి లాలించు బిడ్డల సుకుమారతనువులఁగని, అవిచ్ఛిన్నముగ నిప్పు డిప్పుడె నవీనముగ ప్రయాణము సాగించిన పథికులు ఆదేహము లందున్న వారని గ్రహింపఁగలవారెందఱు మనలో గలరు ? మనల నావరించియున్న యీ విశ్వముయొక్క యదార్థస్థితిని గ్రహింపఁ గలుగుట "జ్ఞానము" అని భగవానుఁడు గీతలందుఁ దెలిపినాఁడు.

ఈ క్షేత్రము పాంచభౌతిక మిశ్రితమైన యీవిశ్వమువలె-పంచభూతాత్మకమైన యీ దేహమును వాస్తవముగ నెఱుగ జాలిన వాఁడు 'పురుషుఁడు'-అనియుఁ జెప్పఁబడుచున్నాఁడు. ఈ క్షేత్రము-ప్రకృతి ; ప్రకృతి యందధిష్ఠించియున్న పురుషుఁడు సాక్షియై, సకలమును జూచుచుండును. ఈ తనువును ఆయా వ్యాపారములందుఁ బ్రవర్తింపజేయుచు, పోషించుచు, ఇంద్రియములద్వారా ఆయా సుఖ దుఃఖాదుల ననుభవింపఁ జేయుచుండును. ఆతఁడే మహాప్రభువు-పరమాత్మ-ఈవిషయముఁ దెలిసికొనఁజాలినవాఁడు బంధవిముక్తుఁడగును. ఆతఁడీసకల విశ్వస్థితియందు సుస్థిరము-అప్రతిహతమైన ఆత్మజ్యోతిని వీక్షింపఁ జాలును. కాని, దేహాత్మబుద్ధి గలవాఁడు-దేహమే తానని భ్రమ పడువాఁడు పలువిధములైన ఆశలకు లోఁగి వివిధ కర్మముల నాచరించుచు వానిచే బంధింపఁబడి, తత్ఫలానుభవమునకై మఱల మఱల జన్మించుచుండును. చూడుడు ! చిన్నపిల్లలకు బోధించు విధమున బాబా మనకుఁ దెలియఁజెప్పిన పలుకులను గమనింపుడు ! "కర్మకారణముగ-నేను (ఫలాపేక్షతో) కావించిన కర్మములవలన ఈ దేహమునఁ బ్రవేశించితిని. నాపేరు "దేహి" (దేహముకలవాఁడు) అని మహదర్థనిగూఢమైన యొకచిన్న వాక్యములో బాబా తెలిపినది గ్రహింపుడు ! మనమెవరమో ! మనము చూచుకొనవలయును. "నీవెవఁడవో ఆలోచించుకొనుము" అనిబాబా మనకుఁ దెలిపినాఁడు.

జ్ఞాని- పరమాత్మ నెల్లెడలవీక్షింపఁజాలును. ఆ కారణమున బాహ్యరూపములఁ గని భ్రమనొందఁడు. నిరంతరాభ్యాస వైరాగ్యములవలన మానవుఁడీ 'యెఱుక'ను బడయఁగలఁడు. అటులనుట దేహపోషణాదుల విషయమై నిర్లక్ష్యము వహించుట యనితలంపరాదు. స్వపర సంబంధములైన విధుల నిర్వర్తించుట యందు నిస్స్వార్థబుద్ధితో

త్యాగనిరతితో లెస్సగ జాగరూకత కలిగి, దృష్టిమాత్రము సర్వాంతర్గతుండైన పరమాత్మయందు నిలుప నేర్వవలయును. ఇది మిక్కిలి కష్టమైన పరిశ్రమయే. సందేహము లేదు. కాని, యీ ప్రయత్నము మానవుడు ఎప్పుడైనను ప్రారంభింపవచ్చును. ఆ మహాప్రభువు కరుణాలేశమున సాధకునకు జయము లభించితీరును.

## 13. శ్రీమద్భగవద్గీత-గుణత్రయ విభాగయోగము

సత్వం రజస్తమ ఇతిగుణాః ప్రకృతిసంభవాః
నిబధ్నంతి మహాబాహో దేహేదేహిన మవ్యయమ్. (14-5)

అర్జునా! ప్రకృతివలన కలిగిన సత్వము-రజము-తమము అనుగుణములు అవ్యయుడైన ఈ దేహిని దేహమునందు బంధించుచున్నవి.

తత్ర సత్వం నిర్మలత్వాత్ప్రకాశక మనామయం
సుఖసంగేన బధ్నాతి జ్ఞాన సంగేన చానఘ! (14-6)

వీనిలో సత్వగుణము నిర్మలమగుట నిద్రిపకాశకము, అనామయము (చెఱుపులేనిది) అగును. ఇది సుఖసంసక్తి చేత-జ్ఞానసంగమమున జీవిని బంధించును.

రజో రాగాత్మకం విద్ధి తృష్ణా సంగ సముద్భవం
తన్నిబధ్నాతి కౌంతేయ కర్మ సంగేనదేహినమ్. (14-7)

రాగాత్మకమైన రజోగుణము ఆశతో కూడినదని తెలిసికొనుము. ఇది యీ దేహిని కర్మముల నాచరించుటయందు సంసక్తి గలుగజేసి బంధించుచుండును.

తమస్త్వజ్ఞానజం విద్ధి మోహనం సర్వదేహినామ్
ప్రమాదాలస్య నిద్రాభిస్తన్ని బధ్నాతి భారత. (14-8)

కాని, అజ్ఞాన జనితమైన తమోగుణము సకల దేహధారులను అజాగ్రత-అలసత-నిద్రలచే బంధించుచుండును.

మాం చయో ఽ వ్యభి చారేణ భక్తియోగేన సేవతే

స గుణాన్ సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే. (14-26)

అర్జునా! ఎవఁడు నిశ్చలమైన భక్తియోగముచే నన్ను సేవించునో అతఁడీ గుణములమూఁటిని అతిక్రమించి బ్రహ్మమును పొందుటకు సమర్థుఁడగును.

**శ్రీ సాయీగీత:** ఈ శుద్ధ చైతన్యము త్రిగుణములద్వారా మువ్విధముల విభజింపఁదగును. అవి 1. పారమార్థిక సత్యము. 2. వ్యావహారికసత్యము. 3 ప్రాతి భాసికసత్యము అని. దేహమునకు బాల్య-యౌవన-వార్ధక్యములనఁబడు మూఁడు స్థితులున్నట్లు ఈసత్యమునకు మూఁడు స్థితులుగలవు. "పారమార్థికస్థితి" యందున్నవాఁడు (సత్పురుషుడు) ఆ సత్యము సత్యముగ-భేదరహితముగఁ జూచును. శాస్త్రానుగుణముగ సకలము నాచరించును. "వ్యావహారికస్థితి" యందున్నవాఁడు (మంచివాఁడు) శాస్త్రబోధనల ననుసరించును-కాని, ప్రతిపదమున భేదమును పాటించుచు, మంచిమాత్రము స్వీకరించుచు, చెడును త్రోసివేయుచుండును. ఇక "ప్రాతిభాసికస్థితి" యందున్నవాఁడు (మూఢుడు) సత్యమును, యథార్థముగఁగాని, ఉన్నది ఉన్నట్లుగాని చూడక భేదమును తారుమారుగఁ జూచును. (మంచిని చెడుగ-చెడును మంచిగ) వ్యావహారిక స్థితిలోని వానికి వ్యతిరేకముగ పాటించును. కాని ఆత్మ (బ్రహ్మము) ఈ మువ్విధస్థితి యందు సమానమే (సా. బో. 125)

**వివరణము :** మనము నిరంతము ఆత్మ పరీక్ష చేసికొందుమేని మన మానసికస్థితి - స్వభావములచే నుత్తేజితులూపఁ బడుచున్నారమని యెఱుఁగఁగలము. ఒకసమయమున సూకరోచితమైన బుద్ధితో ప్రవర్తించుచుందుము. మఱొకవేళ పశుప్రాయమై అదుపులేని కామోద్రేకాదులతో ప్రవర్తించుదుము. మఱొకతఱి, సాధు సత్పు

రుషులవలె యోగ్యములగు శాంతిక్షమలు గలిగి వర్తింతుము. బాబా ఈ త్రివిధస్థితులు 'అజ్ఞానవశతనున్న బాల్యమునకు అప్రతిహతమై కామోద్రిక్తమైన యౌవనదశకు, వివిధానుభవములచే శాంతివిజ్ఞానములం బడయజాలిన వార్ధక్యదశకుఁ జక్కగఁబోల్చినాఁడు. ప్రతి జీవియు ఈ త్రివిధములగు గుణములఁ గలిగియున్నవాఁడే కాని, యొక్కొక్క జీవియందొక్కొక్క గుణము ప్రధానమై ప్రకాశించుచుండును.

ఈ విశ్వాత్మకమగు ప్రకృతి యందీ త్రివిధములగు గుణములు (సత్వరజస్తమములు) మూలాధారములై యున్నవి. క్రిందటి అధ్యాయమున 'క్షేత్రజ్ఞుఁడు'- అని తెలుపఁబడిన 'ఆత్మ'-త్రిగుణరహితుఁడు ఈ త్రివిధములైన గుణములే ఆత్మను లోభపఱచి, దేహమునఁజేర్చి, యందు బంధించినది. ఎఱుక గలిగిన యోగి వీనిని గ్రహించి, జీవితమున నిర్లిప్తతాస్థితి వహించును. సుఖదుఃఖ జయాపజయాదులందు పొంగని-క్రుంగని-సమత్వ బుద్ధిని పెంపొందించుకొనుచు నీత్రిగుణముల కతీతుఁడై ప్రవర్తించును.

సమర్థ సద్గురు దేవుఁడగు శ్రీసాయీనాథుని ధ్యాన శ్లోకమును గమనింపుడు !

> బ్రహ్మానందం-పరమ సుఖదం-కేవలం-జ్ఞానమూర్తిం
> ద్వంద్వాతీతం-గగనసదృశం-తత్వమస్యాది లక్ష్యం
> ఏకం-నిత్యం-విమలమచలం-సర్వధీ సాక్షిభూతం
> సాయీనాథం-త్రిగుణరహితం-సద్గురుం (త్వం) తంనమామి.

శ్రీసాయీనాథుఁడు ద్వంద్వాతీతుఁడు. త్రిగుణరహితుఁడు. అని యిందుఁ దెలుపఁబడినది. శ్రీకృష్ణ భగవానుఁడీ త్రిగుణముల నతిక్రమించుట కొకైక రహస్యమార్గము శ్రీభగవానుని అనన్యభక్తిని సేవించు టొక్కటియె-యని తెలిపినాఁడని సాధకులు గ్రహింపఁదగును.

## 14. శ్రీమద్భగవద్గీత-పురుషోత్తమప్రాప్తియోగము

అధశ్చోర్ధ్వం ప్రసృతాస్తస్య శాఖా గుణప్రవృద్ధా విషయ ప్రవాళాః !
అధశ్చ మూలాన్యను సంతతాని కర్మానుబంధీని మనుష్యలోకే (15 2)

గుణములచే నభివృద్ధినొందుచు విషయములను చివుళ్లుగలిగి, శాఖలను క్రిందఁబైనఁ బ్రసరింపఁజేయుచు కర్మానుబంధములగు మూలములు క్రింద మనుష్యలోకమున వ్యాప్తమగుచున్నవి (సంసారవృక్షము)

శరీరం యదవాప్నోతి యచ్చాప్యుత్క్రామతీశ్వరః
గృహీత్వైతాని సంయాతి వాయుర్గంధానివాశయాత్ (15-8)

ఆత్మ (ఈశ్వరుఁడు) శరీరమున జేరునపుడు-విడుచునపుడు వాయువు ఆయాస్థానములనుండి (పుష్పాదులనుండి) వాసనలను(సుగంధదుర్గంధములను) గొనిపోవునట్లు వీనిని (ఆరు-మనస్సు, జ్ఞానేంద్రియములను) గొనిపోవును.

సర్వస్యచాహం హృదిసన్నివిష్టో మత్తః స్మృతి ర్జ్ఞానమపోహనంచ
వేదైశ్చ సర్వై రహమేవవేద్యో వేదాంతకృద్వేదవిదేవ చాఽహమ్. (15-15)

నేను సకలభూతహృదయములనున్నవాఁడను. జ్ఞప్తి-జ్ఞానము. అజ్ఞానము నావలననే కలిగినది. సకల వేదములచేత తెలిసికొనఁదగినవాఁడను నేనే! వేదాంతకర్తను నేనే. సకలవేదముల నెఱిగినఁవాఁడను నేనే.
**శ్రీ సాయిగీత :** పర్యవసానమున - చేతనాఽచేతనములందన్ని రూపముల దైవము చూఁడబడుచున్నాఁడు. భగవానుఁడు కలఁడు. దైవము లేని స్థానము విశ్వమునందెందును లేదు. ఈ సకలమునం దావరించియున్న ఈశ్వరుని కనుగొని గుర్తింపనీయని "మాయా" ప్రభావమును మాడుము! నేను-నీవు-ఈ విశ్వమున సకలము ఈశ్వరుని అంశమైయున్నారము. ఆ మహాప్రభువులోని భాగములము.

(సా. బో. 122)

మీరెక్కడనున్నను యుండుడు. మీ రేమైనను కావింపుడు. ఇది సర్వకాలముల జ్ఞప్తియందుంచుకొనుఁడు! మీరు తలంచునది-పలుకునది-కావించునది నేనెల్లవేళలఁదెలిసికొనుచుందును. (సా. బో. 406)
అంతట కాకా మహాజని - హ. సీ. దీక్షిత్తు ఈ విషయమును గూర్చి కలియఁబలుకుకొని, వందలమైళ్లదూరమున నేమి జరుగుచున్నది-పలుకబడుచున్నది సకలమును బాబా తెలిసికొనఁగలడని వారు గుర్తించిరి.
(సా. బో. 407)

దేవుఁడు అంతదూరమున నున్నాడా? ఆతఁడు ఆకాశముపైన లేఁడు. పాతాళముక్రింద లేఁడు. ఎల్లప్పుడు ఆతఁడు నీ దగ్గఱనే యున్నాఁడు. ఆయనను వెదకుటకు నీవెక్కడకుఁబోవుచున్నావు?
(సా. బో. 151)

**వివరణము :**- భగవానుని అవతారములన్ని ప్రవర్తించుచున్నను ప్రపంచమున బహువిధములగు వ్యసనములు పొడచూపుటకు కారణము ఆపరమేశ్వరుని అపారకరుణయందు విశ్వాసము లేకపోవుటయే యని గుర్తింపదగును. దైవము తన అవ్యాజ కరుణాప్రవాహము నెల్లెడ ప్రవహింపఁజేసి, సముద్ధరింతునని ప్రతిజ్ఞజేసి తెలుపుచున్నను పలువిధములైన దుఃఖములు-కష్టములు ఈ ప్రపంచమునఁ బొడముటకు కారణమేమో - ఏ విధములైన బాధలేల కలుగుచున్నవో విచారించుదము.

ఈ జీవకోటిపై భగవానునకుఁగల ప్రేమను గూర్చి సందేహింపవలసిన పనిలేదు. కాని, ఆ తండ్రి మనయెడఁజూపు ప్రేమకు తుల్యముగాక పోయినను ఆ ప్రేమలో సహస్రాంశమైన ఆ దైవమునందుఁ గలిగియున్నవారమా? ఆ మహాప్రభువు ఎల్లెడనెల్లవేళల మనలోపల-వెలుపలఁగలడని గుర్తింపఁ గలుగుచున్నవారమా? అని మనలో మనము ప్రశ్నించుకొనవలయును. మన పిల్లలకు చిలుక పలుకులవలె

మనము బోధించు ఈ ప్రాథమిక సత్య సూత్రములను మనదైనందిన జీవనమున-నిత్యకార్యాచరణమున విస్మరించుటయే మనము కావించు లోపమని తెలిసికొనవలయును. శ్రీకృష్ణభగవానుఁడు తెలిపిన విషయమే తానెల్లెడనుండి, మనము తలంచు తలంపులను, పలుకు పలుకులను, కావించు పనులను, గమనించుచునే యున్నవాఁడనని బాబా పలుమాఱులు పలికినాఁడు - పలుకుట మాత్రమేకాదు - ఈ విషయము ప్రత్యక్షర సత్యమని కోకొల్లలగు సందర్భముల తనబిడ్డల అనుభవములందు వ్యక్తపఱచినాఁడు.

చెడు తలంపులు మనమనస్సునఁ బొడమిన - కటువులగు పలుకులు మననోటనుండి వెడలిన, తగనిపనులు చేసిన మనము 'శ్రీ సాయీ ప్రేమి' యగువానికి అనుచితమగు రీతినిఁ బ్రవర్తించుచున్నవారమని యెఱుఁగవలయును. మనము బాబా సమక్షమున నున్నవారముగ గుర్తించి, అట్టి అవినీతి ప్రవర్తనములకు లోఁగరాదు. "నీవు తలంచునది - పలుకునది - చేయునది యెల్లవేళల నీ చెంతనేయుండి గమనించుచున్నవాఁడను. అని బాబా తనఆశ్రితులగుబిడ్డలకు బోధపఱచినాఁడు. పెడదారులఁ ద్రొక్కనున్న 'సాఠే' మొదలగు భక్తుల యెదుట ప్రత్యక్షముగఁ బొడమి తన సర్వవ్యాపకత్వమును ప్రదర్శించి వారలను దుష్పథముల నుండి తప్పించినాఁడు. ఈ విషయములను మనము విస్మరింపక ఆచరణమునందుంచుకొని, బాబాను అనుసరించితిమేని, భగవానుని కరుణా ప్రశంసలను గూర్చి నిరంతరము చెప్పుకొనుచుందుమేకాని, వ్యసనములఁ గూర్చి తెలుపుకొనునట్టి దుర్గతులు మనకు దాపరింపవు

వాయువు పుష్పాదులనుండి సువాసనలఁ గొనివచ్చు విధమున తానుభగవానుఁడనని, అపార- అవ్యాజ ప్రేమ- సర్వజ్ఞత్వాది సకల

శక్తి సంపదలను గూర్చుకొని అవతరించినవాఁడనని, శ్రీసాయీమహా ప్రభువు మనకు పలుమాఱులు విస్పష్టముగఁ దెలిపినాఁడు. ఈ ఒక్క తలంపే మనలను త్రేడ పఱచి సముద్ధరింప సమర్థమైనది. ఇట్టి తలంపు మన ఆచరణ రూపమున పెంపొంది శ్రీ సాయీ అనుసరణము సద్యోతకము కావలయును.

## 15. శ్రీమద్భగవద్గీతామృతము - దైవాసురసంపద్విభాగ యోగము

అభయం సత్త్వ సంశుద్ధిః జ్ఞానయోగ వ్యవస్థితః
దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయ స్తప ఆర్జవమ్. (16-1)

అభయము-హృదయ పవిత్రత-జ్ఞానయోగమునందు చలింపని స్థితి-దానము-ఇంద్రియనిగ్రహము - ఫలత్యాగరూపమైన కర్మాచరణము - శాస్త్రాధ్యయనము-తపస్సు-ఋజుభావము కలిగియుండుట.

అహింసా సత్య మక్రోధ స్త్యాగ శ్శాంతి రపైశునమ్
దయా భూతేష్వలోలుప్త్వం మార్దవం హ్రీర చాపలమ్ (16-2)

(త్రికరణములనే జీవిని) హింసింపకుండుట-సత్యము పలుకుట - క్రోధము లేకుండుట-త్యాగనిరతి-శాంతి కలిగియుండుట-కుటిల స్వభావము లేకుండుట-సకల భూతములందు దయ కలిగియుండుట-దురాశ లేకుండుట - మృదుభావము-సిగ్గు (చెడుపనులయెడ) కలిగియుండుట - చపలత్వము లేకుండుట.

తేజః క్షమాధృతిః శౌచమద్రోహో నాతి మానితా
భవంతి సంపదం దైవీ మభిజాతస్య భారత. (16-3)

తేజము-సహనబుద్ధి-ధైర్యము-పవిత్రత - ద్రోహచింతన లేకుండుట - అభిమానము (గర్వము) లేకుండుట-ఇవి అన్నియును అర్జునా! దైవీ సంపదతో జనించిన వానికి ప్రాప్తించును.

దంభో దర్పోఽభిమానశ్చ క్రోధః పారుష్యమేవచ
అజ్ఞానం చాభిజాతస్య పార్థ సంపద మాసురీం. (16-4)

పార్థ! డాంబికము-దర్పములు-పలుకుట-స్వాభిమానము-క్రోధము-పరుషవచనము - అజ్ఞానము మొదలగునవి ఆసురీ సంపదతో జనించిన వానికిఁగలుగును.

దైవీ సంప ద్విమోక్షాయ నిబద్ధ్యా మాసురిమతా
మాశుచః సంపదం దైవీమభిజాతోఽసిపాండవ. (16-5)

ఓ పాండవోత్తమా! దైవీసంపదవలన బంధవిముక్తి (మోక్షము) కలుగును దైత్యసంపద బంధము గలిగించును. నీవు దైవీసంపదతో జనించినవాఁడవు కావున విచారపడకుము!

శ్రీసాయీగీత :- సా. బో:- (సన్న్యాసియైన దేవదాసుతో) వైరాగ్యమును పాదుకొలుపుకొనుము ×××. మోహము సుఖము మొదలగు ఉపాధులను త్యజింపుము. భగవానుని ధ్యానింపుము. అజ్ఞానమును నిర్మూలింపుము. కామమును జయింపలేని వానికి దైవప్రాప్తి లేదు. దైవసాక్షాత్కారముఁబడయఁజాలడు. (సా.బో. 204)

సా. బో:- సత్సంగమము - మంచివారితో సాంగత్యము శ్రేయము- అది మేలుఁగూర్చును. దుస్సంగమము- చెడ్డవారితోడి చెలిమి హాని. అది కీడుకలిగించును. కావున ప్రయత్నపూర్వకముగ దుస్సాంగత్యము విడనాడవలయును. ×××

దాంపత్య సుఖముపొందుట ధర్మసమ్మతమే. కాని కామమునకు బానిసీఁడుకాఁదగదు. కామలంపటులకు ముక్తి దుర్లభము. ××× కోరికలను అధీనమునందుంచుకొనవలయును. అవి నీకు లొంగి యుండవలయునుగాని, నీవు వానికి లోఁగియుండఁదగదు. నీ అంతశ్శత్రువులను (కామక్రోధాదులను) మితిమీఱనీయక నీవు ఉపయోగించుకొనుము.

కామము - ధర్మపత్నియందు, క్రోధము - నీదుష్ప్రవర్తనము నెడ, లోభము-దైవనామస్మరణమున, మోహము - ముక్తి విషయమున, మత్సరము-చెడ్డపనులయెడ-కలిగుండుము. మదము ఎన్నడును తగనిది- వర్జింపుము- (సా. బో. 313)

వివరణము :- పైరులను పెంచజూచు కృషీవలుడు కష్టములను బాధ్యతలను సహించి వహించవలయును. పైరులకు హానికలిగించు కలుపులను పెకలించుచు వేరుపురుగులను చీడపురుగులను రూపుమాప వలయును. ఆవిధముగ ఆధ్యాత్మిక కృషీవలుడు సాధకుడు ద్వివిధములగు బాధ్యతల సహించవలయును. దైవీసంపదలగు సద్గుణములను పెంపొందించుకొనవలయును. ఆసురీ సంపదలగు దుర్గుణములను రూపుమాపవలయును.

ప్రతివ్యక్తియు ఈ ద్వివిధములగు (దైవి-ఆసుర) సంపదలతో జనించును. కాని వాని హెచ్చుతగ్గులను ప్రమాణములు ద్యోతకములగును. కొందఱియందు దైవిసంపద లతిశయించియుండును- మఱికొందరయందు ఆసురీ సంపదలధికమ్ము తోచును. ఆధ్యాత్మిక పథగామి ఉన్నతస్థానము- పరంధామముజేరుకొనుటకు ఉత్తమ గుణములను దైవీసంపదలను పెంపొందించుకొనుచు అథః పతనము కలుగజేయు ఆసురీ సంపదలగు దుర్గుణములను రూపుమాపుకొనవలయును. "దైవసంపద్విశేషుడవగు నీవు విచారపడవలసినపనిలేదు" అని భగవానుడు అర్జునునకు బోధించినాడు, మనమెంతెంతవనుక దుర్గుణములను నిర్మూలించి సద్గుణములను పెంపొందించుకొందుమో-మనమంతంత వనుక ఆధ్యాత్మిక పథమున పురోగమించుచుందుము.

దుర్గుణములు మానవుని ఆధ్యాత్మిక జీవనమున నెట్లు హాని కలిగించుచున్నవో తెలుపుచు, ఆ దుర్గుణములను సైతము-పంటకాపు కలుపు మొదలగువానిని నిర్మూలించి, వానిని పైరునకెట్లు ఎరువుగా

గల్పించుకొనుచున్నాఁడో ఆ విధముగ వానిని (క్రోధాదులను) ఆధ్యాత్మిక జీవనములకు- దైవీసంపదకు దోహదపుఁగూర్పు వానిగ పరిణమింపఁజేసికొనుమని బాబా అతి నిగూఢముగ మనకుఁ దెలిపినాఁడు (సా. బో. 150) "చంపువాఁడె రక్షించువాఁడు - రక్షించువాఁడె చంపువాఁడు"- [ఆసురీ సంపదలగు దుర్గుణముల నిర్మూలించువాఁడె దైవీసంపదలను రక్షించుకొనువాఁడు. ఆసురీ సంపదలగు దుర్గుణములను రక్షించుకొనువాఁడె దైవీసంపదలగు సద్గుణములను చంపుకొనువాఁడు అని భావము]

## 11. శ్రీమద్భగవద్గీత - శ్రద్ధాత్రయ విభాగ యోగము

దేవద్విజ గురు ప్రాజ్ఞ పూజనం శౌచమార్జవమ్
బ్రహ్మచర్య మహింసాచ శారీరం తప ఉచ్యతే. (17-14)

దేవతలను. బ్రాహ్మణులను, గురువులను, ప్రాజ్ఞులను పూజించుట, పవిత్రత, ఋజువర్తనము, బ్రహ్మచర్యము, అహింస, అనునవి శరీర సంబంధమగు తపము లని చెప్పఁబడును.

అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితంచయత్
స్వాధ్యాయాభ్య సనంచైవ వాఙ్మయం తప ఉచ్యతే (17-15)

ఇతరులకు కష్టము కలిగించని విధమునఁ బలుకుట-సత్యము- ప్రియము-హితమునైన పలుకులు పలుకుట, వేదాధ్యయనము నవి వాగ్రూపమగు తపమగును.

మనఃప్రసాద సౌమ్యత్వం మౌనమాత్మ వినిగ్రహః
భావసంశుద్ధి రిత్యేత త్తపోమానసముచ్యతే. (17-16)

మనోనైర్మల్యము- మార్దవము- మౌనము, నిగ్రహము భావసంశుద్ధి కలిగియుండుట మానసిక తపమనఁబడును.

శ్రద్ధయా పరయాత ప్తం త స్త్రివిధం నరైః
అఫలాకాంక్షి భిర్యుక్తైస్సాత్త్వికం పరిచక్ష్యతే. (17-17)

ఫలకాంక్షవదలి, మిక్కిలి శ్రద్ధతో యోగి జనులచే కావింపఁబడు ఈ త్రివిధములైన (కాయికవాచక మానసికములైన) తపస్సులు సాత్వికములు అని పేర్కొనఁబడుచున్నవి.

దాతవ్యమితి యద్దానం దీయతేఽనుపకారిణే
దేశేకాలే చ పాత్రే చ తద్దానం సాత్వికం స్మృతమ్. (17_20)

దేశకాలపాత్రము నెఱిఁగి, యీయఁదగినదియని తెలిసికొని, తిరిగి మేలుచేయలేనివాని కొసంగఁబడుదానము "సాత్వికము" అని పలుకఁబడును.

ఓమ్‌తత్సదితి నిర్దేశో బ్రహ్మణస్త్రివిధః స్మృతః
బ్రాహ్మణాస్తేన వేదాశ్చ యజ్ఞాశ్చ విహితాః పురా. (17_23)

ఓమ్_తత్_సత్ అని ముప్విధముల బ్రహ్మము నిర్దేశింపఁబడుచుండును. పూర్వము వీనివలన బ్రాహ్మణులు – వేదములు – యజ్ఞములు సృజింపబడినవి.

తస్మాదోమిత్యుదాహృత్య యజ్ఞదాన తపః క్రియాః
ప్రవర్తంతే విధానోక్తాస్స తతం బ్రహ్మవాదినమ్. (17-24)

కావున ఆస్తికులగు మహాత్ములు వేదవిధానోక్తములగు యజ్ఞములను– దానములను– తపములను "ఓమ్" అని ఉచ్చరించుచు కావించుచుందురు.

తదిత్యనభిసంధాయ ఫలం యజ్ఞతపః క్రియాః
దానక్రియాశ్చ వివిధాః క్రియంతే మోక్షకాంక్షిభిః. (17-25)

మోక్షమును కాంక్షించువారు ఫలమునందు కాంక్షవదలి "తత్" అని యుచ్చరించుచు పలువిధములైన యజ్ఞములను, తపములను, కర్మములను దానములను కావించుచుందురు.

సద్భావే సాధుభావేచ సదిత్యేత త్ప్రయుజ్యతే
ప్రశస్తే కర్మణి తథా సచ్ఛబ్దః పార్థ యుజ్యతే. (17-26)

"శాశ్వతము" అను భావమున- "మంచి" అను భావమున "సత్" అను పదము ప్రయోగింపఁబడును. కావున అర్జునా! ప్రశస్త కర్మములు 'సత్' అను పదముచేఁ దెలుపఁబడుచున్నవి.

యజ్ఞే తపసి దానేచ స్థితిః సదతి చోచ్యతే
కర్మ చైవ తదర్థీయం సదిత్యేవాభి ధీయతే. (17-27)

యజ్ఞములందు తపములందు దానములందు స్థిరతను (నిలుకడను) "సత్" అని పలుకఁబడును. దైవము (కొఱకు) నుద్దేశించి చేయింపఁబడు కర్మమును "సత్" అని పేర్కొనఁబడును.

**శ్రీ సాయిగీత :- సా. బా :-** మృత్యుంజయు ప్రీతి కొఱకు "రామ విజయము" ఇక్కడ (మసీదునందు) పఠించుచుండుము. (సా. బో. 190)
**సా. బా:-** ఇతరులయొక్క శ్రమగాని, ధనముగాని ఉచితముగ స్వీకరింపకుము. దీనిని నీ జీవిత నియమముగ పాటింపవలయును.

(సా. బో. 226)

**సా. బా:-** (దేవదాసుతో) ×× భగవానుని ధ్యానించుము. అజ్ఞానమును నిర్మూలింపుము (సా. బో. 204)

**సా. బా:-** (నానాసాహెబ్ చందోర్కర్‌తో) ×××. నానా! ఎవరేని ఏమేని యాచించిన నీ శక్తికొలఁది సమర్పింపుము. ఆ యాచకుఁడు దానితో తృప్తినొందక అధికముగ యాచించినా సౌమ్యముగ "వీలుకాదు"- అనుము. ఆగ్రహోదగ్రుఁడవై నీ యధికార దర్పమును ఆ బిచ్చగానిపై ప్రకటింపకుము. (సా. బో. 307)

**వివరణము** (ఎ) (14-15-16-17 శ్లోకములు): శ్రీ మద్భగవద్గీతలందు తదితర శాస్త్రములందు మనోవాక్క్రియాదుల విషయమున నియమము ముఖ్యమని తెలుపఁబడినది. దానివలన ఆధ్యాత్మిక శక్తిసంపదలు పెంపొందును. ఈ యుపాధిరూపములగు మన శరీరములు వివిధములగు తత్త్వముల కూడలిగాయున్నవి. త్రివిధములగు ముఖ్య భాగ

ములుగ నివి విభజింపఁబడినవి. 1) భౌతిక [పంచభూతమయ] 2) మానసిక [మనోమయ] 3) ఆధ్యాత్మిక [విజ్ఞానమయ] ములుగ విభజింప నగును. ఆధ్యాత్మిక పథమునమనకు తోడ్పడువారలైన దైవ - సాధు సత్పురుషులను సేవించుట - బ్రహ్మచర్యము - సర్వభూత హిత రతి- ఋజుప్రవర్తనము మొదలగునవి శారీర తపములుగఁదెలుపఁబడినవి.

మన మనః ప్రకటనమే మనవాక్కు - మన ప్రవర్తమునను చక్కబఱచు మనఃప్రసాద సౌమ్యత్వములు సత్యప్రియ హితకరము లైన వాక్కులు - వేదాధ్యయనము - నిరంతర పరాత్మధ్యానము- సమత్వము-దయ- మానము- ఇత్యాదులు వాగ్రూపమగు తపస్సుగఁ దెలుపఁబడినది. పైన, తెలుపఁబడిన నాలుగు శ్లోకములు శారీర వాచక మానసిక తపములుగను ఆధ్యాత్మిక జీవనమును పెంపొందించు నవిగఁ దెలిసికొనఁదగును. సాధకుఁడైన ఆశ్రితుఁడు ఎంత తెలివికల వాఁడైనను గురువైనవాఁడు బోధాచరణములందు సర్వసమర్థుఁడు కానిచో ఆ ఆధ్యాత్మిక పథమును విశదపఱచుచు తన ఆశ్రితునా మార్గమున నడిపింపఁజాలడు. ఈ పవిత్రాచరణములచే- అనగా పైనఁదెలుపఁబడిన త్రివిధములగు తపస్సులచే "గురువు" అగువాని జీవితము పూర్తిగ పరిణామమొందవలయును. అట్టివాఁడు మాత్రమే తన ఆశ్రితుని చక్కదిద్ద సమర్థుఁడు.

శ్రీ సాయీనాథుని జీవితము ఈ ఆధ్యాత్మిక పథమునందు- భగవద్గీతలందుఁ దెలుపబడిన విధమున సంపూర్ణముగ పరిణతి నొందినది. బాబా, దానవిషయమునఁగూడ స్వాభిమానదంభ గర్వాదులను త్యజించి చేయఁదగునని బోధించినాఁడు. శ్రీసాయీ ప్రభువు తన ఆశ్రితులఁ జక్కదిద్దు విధానములు ఆయా భక్తుల అనుభవముల నెఱుఁగవలసినవే కాని, వివరింపసాధ్యములు కావు. వివిధావకాశములఁ గల్పించి, పెక్కు దృష్టాంతరముల ప్రదర్శించి, పలుకులు బోధలతోఁ

గాక అనుభవపూర్వకముగ ఈ ఆధ్యాత్మిక ప్రవర్తనము బాబా తన భక్తులకు సమకూర్చినాఁడు. భగవద్గీతయందు దెలుపఁబడిన బోధలను బాబా తన అంకిత సంతతికి స్వానుభవపూర్వకముగ విశదపఱచినాఁడు.

బి] (23-24-25-26-27 శ్లోకములు) శ్రీ సాయీగీత :-

సా. బా:- (జగత్ సృష్టిక్రమము)- ప్రథమమున ఓమ్‌కారము. ఓమ్‌కారము నుండి భావాకారము.........(సా. బో. 147)×××. ఆత్మ నివేదనము. దైవమునకు సంపూర్ణ శరణాగతి (ప్రపత్తి) చేయుము...
[సా. బో. 123-

×××అది అఖిల విశ్వమునకు మూలకారణము తదంతర్గతసారము]

ఆధారమునగును. సృష్టి స్థితిలయములకది ఏకైక పదము. అది మనకుఁ దెలిసియుఁ దెలియఁబడక యుండును. శుద్ధ చైతన్యము విధమిది- యని పలుకనలవికాదు. కాని, ప్రతిక్షణమున నీయునికి యందది ద్యోతకమగుచుండును. అది లేని కావు లేదు. దానికి రూపము లేదు. అది రంగు ఆకారము లేని వాయువును పోలియుండును. దాని యునికి విషయమున సందేహము లేదు. శుద్ధచైతన్యమే "బ్రహ్మము"- అనఁబడును. బుద్ధిమంతులు దానిని "బ్రహ్మము"- అను పేరనుపాసింతురు. అట్లగుట వారు "బ్రహ్మవిదులు" అనఁబడుచున్నారు. తరు జంతుమానవాది సకలజీవములు దానియందే యున్నవి. కనుటకు- తాకుటకు ఎఱుఁగుటకు అది మూలకారణము. అనేకులకిది యేకైక మూలము. అది సకలమున వ్యాపించియున్నది. అది సత్-చిత్-ఆనందము (సచ్చిదానందము) సత్యము- జ్ఞానము- ఆనందము- ఏకము అగుచున్నది. మన మందఱము అదియే కానుండి మనము వేఱుగలేము(సా. బో. 125)

(బి) వివరణము :- ఎల్ల శ్రుతులు- స్మృతులు "ఓమ్‌తత్ సత్" అను సూత్రముతో ముగియుచున్నవి. మాండుక్యోపనిషత్తు మొదలగు

ఉపనిషత్తులు ఇతరశాస్త్రములు ఈ ఏకాక్షరమైన ప్రణవమును గూర్చి వివరించుచు ఈ సకల వ్యక్తావ్యక్త ప్రపంచము సర్వ చేతనాఽచేతనములు ఈ సకలవిశ్వము ప్రణవాంతర్గతముగఁ దెలుపు చున్నవి. ఈ సకలమున కతీతమై జ్యోతిర్మయము- విశ్వవ్యాప్తము- అగోచరము అచింత్యమును అగువస్తువు (దైవము) యొక్క రూపము శబ్దముగ (సామాన్యులకు బోధనార్థము) యీ ప్రణవము- ఓమ్‌కార ముగ భావింపఁబడుచున్నది. ఆ కారణముననే సకల యజ్ఞదానతపః క్రియాదులీ ప్రణవము "ఓమ్"కారముతో ప్రారంభింపఁబడు చున్నవి. ఆ కారణముచేత బాబా సూక్ష్మముగ మొదట "ఓమ్" కారము అని తెలిపినాఁడు. 'తత్' లేక అది అను శబ్దముపైన బోధ నార్థమై వివరింపఁబడిన బ్రహ్మమును సూచించుచున్నది. మనము కావించు కర్మములన్నియు ఆపరతత్వమున కధీనములై యున్నవని, ఆపరతత్వముచే ప్రేరితములై కావింపఁబడుచున్నవను సత్యమును మనకు నిరంతరము ఱుకకలుచు నిమిత్తమై వివిధ యజ్ఞ తపోదానాదు లను మోక్షము నర్థించువారమైతిమని ఈ'తత్' శబ్దము నుచ్చరించుచు నాచరింపఁదగునని తెలుపఁబడినది.

కాని ప్రేమాత్మకమగు ఉత్తమోత్తమ యజ్ఞమును ఆత్మ నివే దనము (ప్రపత్తి) అని బాబా మనకెఱుకపఱచినాఁడు. అంతకంటె మించిన శ్రేష్ఠమైన యజ్ఞము (కర్మము) మఱియొకటిలేదని గ్రహింపఁ దగును.

"సత్"స్వభావము బాబా పైనఁ దెలిపిన విధమున అది యీ సకలవిశ్వముయొక్క సకల సారము, మూలకారణము- పరిధి- యని నిరూపింపఁబడుచున్నది. ఇంతకుమించి దీనినిఁగూర్చి చెప్పవలసిన పనిలేదు.

## 17. శ్రీమద్భగవద్గీత - మోక్షసన్న్యాసయోగము

చేతసా సర్వకర్మాణి మయి సన్న్యస్య మత్పరః
బుద్ధియోగము పాశ్రిత్య మచ్చిత్తః సతతంభవ (18-57)

నిర్మలమైన మనస్సుతో సకల కర్మములను (ఫలమును) నాయందు లెస్సగ నిలిపి, నన్నే పరమగతిగ విశ్వసించి, బుద్ధియోగమును సమాశ్రయించి (సదసద్వివేకము గలిగి) నిరంతరము నీ మనస్సును నాయందు నిలుపుము.

మచ్చిత్తస్సర్వ దుర్గాణి మత్ప్రసాదాత్తరిష్యసి
అథచేత్త్వమహంకారా న్నశ్రోష్యసివినఙ్క్ష్యసి. (18-58)

నాయందులగ్నమైన మనస్సు గలవాడవై నా అనుగ్రహమున సకల దుర్గములను (కష్టములను) అతిక్రమింపగలవు. అటులగాక దురహంకారమున నా మాటలు (బోధ) వినలేని నీవు చెడుదువు.

మన్మనాభవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు
మామేవైష్యసి సత్యంతే ప్రతిజానే ప్రియోఽసిమే. (18-65)

నీమనస్సు నాయందు నిలుపుము. నాయందు భక్తిగలిగి యుండుము. నాప్రీతికై (ఫలమునాకు సమర్పించుచు) కర్మములను జేయుము. నాకు నమస్కృతులర్పింపుము. సత్యముగ నన్నే పొందగలవు. ప్రతిజ్ఞాపూర్వకముగ నీకుఁ దెలుపుచున్నాఁడను. నాకు నీవు ప్రియుఁడవు.

సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ
అహంత్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః (18-66)

సకలకర్మ (ఫలముల) ములను, సకలాశ్రయములను పరిత్యజించి, నన్నొక్కనినే శరణమొందుము. నేను సకల పాపములనుండి నిన్ను విముక్తునిఁగావింతును. ఏమాత్రము వ్యసనమొందకుము.

**శ్రీసాయిగీత :** నన్ను ధ్యానించుచు, నా నామము స్మరించుచు నా లీలలను గుర్తించుచుండు నతఁడు నాఅనుభవము పొందఁగలఁడు. వాని సకల కర్మములు విడిపోవును. నేనెల్లవేళల వానిచెంతనే యుందును. (సా. బో. 10)

అనన్యభక్తితో నన్నుచింతించుచు నన్ను శరణొందిన వానికి నేను ఋణపడినఁవాఁడను. నాతలనైన వెచ్చించి వానిని రక్షించి తీరుదును. (సా. బో. 13)

నిందుమ నన్ను నాకర్పించి నాయందు విశ్రమించువాఁడు తన దేహముసు గూర్చియేని, తన ఆత్మను గూర్చికాని, భయపడవలసిన పని లేదు. నన్నొక్కనినే చూచుచు. నన్నుగూర్చియేవినుచు, పలుకుచు, నాయందే భక్తిపలుఁవువాఁడు (చైతన్యమును) దైవమును పొందును. నిత్య శుద్ధ బుద్ధునిగ నన్ను సేవించువాఁడు నన్నుజేరును. (సా బో. 20) నన్ను శరణొంది సేవించు వారిని శుభ్రసిద్ధ మార్గమున నడిపించి, గమ్యముఁజేర్చుటకు నేను ఎల్లవేళల జీవించియే యున్నవాఁడను. నీ సకల సంకల్పములకు నన్నేకైక లక్ష్యము జేసికొంటివేని నీవు పరమార్థమఁ బడయగలవు నన్నుజూడుము. నేను నిన్నుజూతును. (సా. బో. 19)

**వివరణము :-** శ్రీమద్భగవద్గీతలు విశ్వజనాదరణీయ మగుటకుఁ గారణము "సంపూర్ణశరణాగతిఁ జేయు నేజీవినేని సర్వవిధముల ఇహపరముల రక్షింతును"- అని భగవానుఁడు అభయమిచ్చుటయే. భక్తి యొక్క పరాకాష్ఠయే సంపూర్ణ శరణాగతి. అదియే ఆత్మార్పణము - ప్రపత్తి- అను పేరులఁబలుకఁబడును. త్రికరణశుద్ధిగ భగవానుని పద. కమలముల సంపూర్ణశరణాగతిఁ జేసినజీవి తన అహంతను- భేదబుద్ధిని పరిత్యజించి పరమాత్మ నెఱుఁగఁజాలి దైవమునందు లయమొందును

భగవద్గీతలలోని సారాంశమిదియే. కాని, యీ కారణమును పురస్కరించుకొని, యెవరును తన విద్యుక్తధర్మములను కర్మములను త్యజించుట తగదని గీతాప్రబోధముల వలన మనము గ్రహింప వలయును. విధివిహిత కర్మములను ప్రతిమానవుఁ డాచరించి తీరవలయును. భగవానుఁడే తనచే ఆయా కర్మములను కావింపఁజేయుచున్నవాఁడని భావించి, ఆయా కర్మఫలమును మాత్ర మీశ్వరార్పణము చేయవలయును.

ఈ సందేశమునే బాబా మనకందించుట మాత్రమేకాదు, నేటికి నిఁకనాటికిఁ దన ఆశ్రితులకీ ప్రబోధము వారివారి అనుభవముల ద్వారా లెస్సగ బోధపడునట్లు చేయుచున్నాఁడు. చేయగలఁడు శ్రీ సాయీనాథుఁడు తన్ను ధ్యానించుచు, తన బోధలను ఆచరణ పూర్వకముగ పాటించు భక్తుల కిహపర సుఖసంతోష సంతృప్తి శాంతులను ప్రసాదించితీరుదును- అని విస్పష్ట ఫణితిని అభయమిచ్చుచున్నాఁడు.

శ్రీమద్భగవద్గీతలలోని బోధలే శ్రీ సాయీ ప్రభు ముఖోద్గతములగుటఁజేసి శ్రీకృష్ణుఁడుగ అవతరించిన భగవానుఁడే శ్రీ సాయీ బాబాగా అవతరించి భగవద్గీతలందు దాను గావించిన అభయప్రదానములను మరల తన భక్తులకు అనుభవరూపమున బోధపఱచుచున్నాఁడని మనము గాఢముగ విశ్వసింపవలయును.

శ్రీ సాయీకృష్ణార్పణమస్తు!

ఓమ్ తత్ సత్



# శ్రీ సాయీనిలయ ప్రచురణములు

| | | |
|---|---|---|
| 1. | "ఏమిా! నిన్ను పేక్షింతునా!" శ్రీ షిర్డిసాయిబాబా జీవితచరిత్ర [పునర్ముద్రణ కావలసియున్నది] | |
| 2. | శ్రీసాయీ అనుసరణము [ ,, ] | |
| 3. | శ్రీసాయీబాబా పూజా స్తవములు 88 పుటలు | రు. 5-00 |
| 4. | శ్రీరామా! ఆపదుద్ధారకా! (శతకము) | రు. 1-00 |
| 5. | శ్రీహనుమాన్ ఛాలీసా | రు. 1-00 |
| 6. | శ్రీసాయి దేవ శతకము | రు 1-00 |
| 7. | శ్రీవెంకటేశ్వర సుప్రభాతగీతములు; శ్రీలక్ష్మీనారాయణ స్తోత్ర మంజరి | రు. 3-00 |
| 8. | శ్రీభగవద్గీతా మృతము | రు. 12-00 |
| 9. | సాయీబాబా కూడా దేవుడేనా? ఉన్న దేవుళ్ళు చాలరనా? (సందేహనివృత్తి) | రు. 8-00 |
| 10 | శ్రీసాయీ సుభాషితములు | రు. 8-00 |
| 11. | శ్రీహనుమ గీతికా తారావళి | రు. 1-00 |
| 12. | శ్రీసాయీనాథ బోధామృతము 432 పుటలు (డెమ్మీ) | రు 20-00 |
| 13. | శ్రీకరావలంబ స్తోత్ర కదంబము | రు. 5-00 |
| 14. | గోమాతృస్మృతి | రు 1-00 |
| 15. | నా సాయి (180 పుటలు) డెమ్మీ | రు. 15-00 |
| 16. | శ్రీసాయీ శతకము | రు 1-00 |
| 17. | శ్రీకృష్ణకర్ణామృతము; సందేశము | రు. 10-00 |
| 18. | శ్రీసాయీనాథకరావలంబ స్తోత్రము | రు. 1-00 |
| 19. | శ్రీఉమామహేశ్వర స్తోత్రము (ఉచితము) | ——— |
| 20. | శ్రీ సాయీ రామ శతకము | రు. 1-00 |
| 21. | సాయీ మననము | రు. 10-00 |
| 22. | శ్రీచిద్విలాస శతకము | రు. 1-00 |
| 23. | శ్రీకృష్ణసాయీ గీతామృతము | రు. 10-00 |

[ప్రతులకు ప్రచురణకర్తకు వ్రాయండి]